ఆంధ్రప్రబోధినీగ్రంథనిలయము. ద్వితీయభూషణము.

# అరిందమవిజయము

"శ్లో॥ విద్యానామ నరస్యరూపమధికం ప్రచ్ఛన్నగుప్తంధనం ।
విద్యాభోగకరీయశ స్సుఖకరీ విద్యాగురూణాంగురుః
విద్యాబంధుజనో విదేశగమనే విద్యాపరాదేవతా ।
విద్యారాజసుపూజ్యతే నహిధనం విద్యావిహీనఃపశుః ॥"

సంపాదకులు:

అద్దేపల్లి సత్యనారాయణగారు.





గ్రంథకర్త:

ఇక్కుర్తి తిరుపతిరాయఁడు.

# త్వరపడిచందాదారులు గండు

# ప్రథమబహుమానము రు 100 లు పొందుఁడు.

మాగ్రంథమండలిద్వితీయభూషణమగు నీయరిందమవిజయము ను జూచుచునే పరీక్షాప్రశ్నలకు సదుత్తరములు వ్రాయవచ్చును. స రియైన జవాబులువ్రాయువారికినూరురూపాయలు బహుమాన ము యీఁబడును. ఒకరూపాయి పరీక్షాప్రవేశరుసుము చెల్లించి యి క్షకు దరఖాస్తులుచేయువారెట్టి పరీక్షలను ప్యాసయి యుండనక్క లేదు. కేవలముత్సాహమును, బహుమానమొందవలయు నను ప లయును భాషాభిమానమును ప్రధానాంశములు.



...ను దరఖాస్తులఁ బంపవచ్చును. మా...
...కను బరీక్షాదరఖాస్తు లంపుకొనుట ...
...తెలియఁజేయుచు పరీక్షాప్రశ్నల ...

...గా దరఖాస్తులు పరీక్షాప్రవేశరుసు...
...ఁ జేరవలెను. తరువాత పరీక్షాప్ర...

...గ్రంథనిలయము.

మండపల్లి, లింగాలపోష్టు,

కృష్ణా జి...

# త్వరపడిచందాదారులు గండు

## ప్రథమబహుమానము రు 100 లు పొందుడు

మాగ్రంథమండలిద్వితీయభూషణమగు నీయరిందమవిజయము
ను జూచుచునే పరీక్షాప్రశ్నలకు సదుత్తరములు వ్రాయవచ్చును.
రిమైన జబాబులువ్రాయువారికినూరురూపాయలు బహుమాన
యఁబడును. ఒకరూపాయి పరీక్షాప్రవేశరుసుము చెల్లించి యి
కు దరఖాస్తులుచేయువారెట్టి పరీక్షలను ప్యాసయి యుండన
లేదు. కేవలముత్సాహమును, బహుమానమొందవలయు నను ప
లయును భాషాభిమానమును బ్రధానాంశములు.



ను దరఖాస్తులఁ బంపవచ్చును. మాగ్ర
ను బరీక్షాదరఖాస్తు లంపుకొనుట
తెలియఁజేయుచు పరీక్షాప్రశ్నల

గా దరఖాస్తులు పరీక్షాప్రవేశరుసుము
జేరవలెను. తరువాత పరీక్షాప్రశ్న

గ్రంథనిలయము.

మండవిల్లి, లింగాలపోస్టు,

కృష్ణా జిల్లా

ఆంధ్రప్రబోధినీగ్రంథనిలయము. ద్వితీయ భూషణము.

# అరిందమవిజయము.

గ్రంథకర్త

ఇకుర్తి తిరుపతిరాయఁడు.

సంపాదకులు

అద్దేపల్లి సత్యనారాయణగారు.







స్కేప్ అండ్ కో, ముద్రాక్షరశాలన్ముద్రితము.

కాకినాడ

1923.

 [వెల రు 1-0-0.

## గౌరవపోషకులు

మ॥ రా॥ రా॥ శ్రీ. దళపతిరావు నరసింహారావు పంతులుగారు భూస్వామి.
బెజవాడ.

మ॥ రా॥ రా॥ శ్రీ. చిల్లర వేంకటేశ్వర కవిగారు. శతావధాని.
వెల్లలూరు.

## సంవత్సరపోషకులు

మ॥ రా॥ రా॥ శ్రీ. అంకరాజు గంగరాజు పంతులుగారు యీనాందారు. మండవల్లి.

,, మట్టా సుబ్బయ్యగారు. వెల్లలూరు.

,, అద్దంకి పేరయాచారిగారు. వెల్లలూరు.

,, గూడపాటి వీరరాఘవయ్యగారు. వెల్లలూరు.

,, వరికూటి వెంకటసుబ్బయ్యగారు. వెల్లలూరు.

,, కొత్తపల్లి వెంకటసుబ్బారావుగారు, పుట్లచెరువు.

,, కొల్లిపర వీరరాఘవయ్యగారు, మర్చంటు పెరికిగూడెం.

,, చెలపాక అప్పలాచార్యులుగారు, ఈనాముదారు మండవల్లి.

,, తుర్లపాటి ఆంజనేయులు పంతులుగారు, గుడ్లవల్లేరులాకు.

,, పాలకోడేటి సత్యనారాయణమూర్తి పంతులుగారు, మండవల్లి,

,, ఉప్పలూరి వరప్రసాదరావు పంతులుగారు, మండవల్లి,

# అభినందనము.

"ఆంధ్ర ప్రబోధినీ గ్రంథనిలయము చిరస్థాయిగ విలసిల్లు గాక" యని ఆశీర్వదించుచుం దదభివృద్ధినే యాకాంక్షించుచు మాయుద్యమమున కెల్ల విధములం బ్రోత్సాహముం గూర్చుచు దామురచించిన "వైదర్భీపరిణయము" అను గ్రంథరాజమును మాగ్రంథ నిలయమున కొసంగిన మ. తా. రా. శ్రీ. శ్రీరాజా కమచన వేంకటరావు బహద్దరు జమీందారు వారికి మాకృతజ్ఞతాభినందనముల నర్పించుచున్నాము. ఇట్టిస్వధర్మ నిరతులకు సర్వేశ్వరుండు చిరాయురారోగ్యభోగభాగ్యములం గూర్చుగాక!

సంపాదకుండు



# సంపాదకీయ భూమిక

అపరాధ పరిశోధకనవల లెన్నేని వెలువడినవి. వెలువడుచున్నవి, వెలువడనున్నవి, కాని నాటకము లింతవరకట్టివి వెలువడియుండలేదు. ప్రస్తుతకాలమున కుత్సాహజనకము నత్యంతావశ్యకమగు అరిందమ విజయమను నిరూపక నాటకమును „ వాఁడే వీఁడు ” అను నవలను మాతృకగాఁ గొని స్వల్పమార్పులతోఁ బ్రదర్శనానుకూలముగా మా మిత్రులగు శ్రీ బాలకవి ఇక్కుర్తి తిరుపతిరాయఁడుగారు రచించి మాగ్రంథనిలయమునకు, ద్వితీయ భూషణముగ నొసంగిరి.

రహస్యాపరాధ పరిశోధితమును దృశ్యానుకూలముగ రచించుట మిక్కిలి కష్టమైనను సాధ్యమైనంతవర కేలోటును రానీక కథాచమత్కృతి యంతయుఁ జక్కని శైలిని నింపిరి, ఇందు బిస్నాల్, కేశవచంద్-ఫూల్ సాహేబ్ అనునామములతోఁ జేయుదు శ్చేష్టలు—అరిందముని పరిశోధనా ప్రవీణత్వము—జమీలియామాయలు—గారి యొక్క- గడుసుదనము రేవతీ మనోనిశ్చయము మొదలగునవన్నియు పాత్రోచితములుగ నిలుపఁబడినవి.

దేశభాషాభిమానుల సమాదరప్రోత్సాహములచే దేశభక్తి విలసితములగు ఇట్టినాటకములు, నవలలు, ప్రబంధములు మొదలగు ఉద్గ్రంథములు క్రమ క్రమముగఁ బ్రకటింప నుద్యుక్తులమైయున్నాము.

మాయుద్యమమున కెల్లవిధములఁ దోడుపడుచు నిలయమునందాదరాభిమానములం జూపుచున్న గౌరవపోషకులును, సంవత్సరపోషకులును, చందాదారులును, భాషాభిమానులునగు నాంధ్రసోదరులెల్లరును భాషాసేవఁ జేయుచున్న యీగ్రంథనిలయమున కనవరతాభ్యుదయపరంపరలం గూర్చెదరుగాక యనినమ్ముచున్నారము.

# కృతజ్ఞత.

సీ. కవులపోడిమి చెడిన యీ ♦ కాలమందుఁ
గవులపోషణలేనియీ ♦ కాలమందుఁ
గవులగౌరవమడఁగు నీ ♦ కాలమందుఁ
గవులపనినీసడించు నీ ♦ కాలమందుఁ
శిథిలగోపురముల బాగు ♦ సేయుకరణి
బోఁడిమిం జెడ్డవనములఁ ♦ బ్రోచునట్లు
పూడినట్టిజలాధార ♦ ములను వేడ్కఁ
మఱలఁ ద్రవ్వించి పోషించు ♦ మాడ్కి, నేఁటి
కెన్ని యేండ్ల క్రిందటనో గ ♦ తించినట్టి
కవులమర్యాదనూత్న వి ♦ కాసమొంది
వఱలుచుండెనదేపల్లి ♦ వంశవంశ
మౌక్తికంబన బుధలోక ♦ మానసములఁ
బ్రమదముంగూర్చి సత్య నా ♦ రాయణాఖ్య
నలరు వైశ్యకులాంబుధి ♦ విలసితాబ్జు
వలన, నహహా! తొల్లింటి మై ♦ శ్వర్యగరిమ
దేశభాషామతల్లి వ ♦ ర్ధిల్లుచుండఁ
గ్రొత్తక్రొత్తపొత్తములు చే ♦ కెత్తుచుండఁ
జదువరులమానసంబులు ♦ సంతసింప
భోజరాజుకాలము నాఁటి ♦ భోగమెల్ల
మనుమసిద్ధినృపతి నాఁటి ♦ మహిమమెల్లఁ
గృష్ణదేవరాయల నాఁటి ♦ కీర్తిమెల్లఁ
గవులకుంగల్గ సత్కృపా ♦ కలితుఁడైన
తామరసనేత్రుఁడిట్టి వ ♦ దాన్యవరులఁ
బుణ్యమతులను సతతంబుఁ ♦ బ్రోచుఁగాత.

గ్రంథకర్త.

# ఈ నాటకమునందలి పాత్రములు

## పురుషులు.

అరిందముఁడు — అపరాధ పరిశోధకుఁడు.

బ్రాహ్మణుఁడు<br>ముసలిబ్రాహ్మణుఁడు } అరిందముని మాఱు వేసములు.

యోగీంద్రనాథుఁడు — పోలీసు సబిన్స్పెక్టరు

రామదీన్<br>విజయసేనుడు. } రక్షకభటులు.

దేవేంద్రవిజయుఁడు — రేవతికిభర్త.

సిరాజ్ హీన్ — గుల్‌నుమ్‌భర్త.

జయసేనుఁడు — పౌరుడు.

రామ్‌జీ — సరంగు.

గోపాల్‌చంద్ — బేనిమాద్‌పూర్ జమీందారుని సోదరుఁడు

బిన్నాతులాల్ — క్రూరశిఖామణి.

కేశవచంద్<br>ఫూల్ సాహేబ్ } బిన్నాత్‌లాల్ మాఱు పేళ్లు.

గౌరిచంద్ — బిన్నాతులాల్ స్నేహితుఁడు.

యదునాథుఁడు — గోసాయివేషధారియగుదొంగ.

భవాజీ — బిన్నాతు సేవకుడు.

## స్త్రీలు.

రేవతి — బేనిమాద్‌పూర్ జమీందారుని జ్యేష్ఠపుత్రిక.

గుల్‌నుమ్ — తమిజుద్దీన్ కూఁతురు.

మోహిని — బిన్నాతు మొదటిభార్య.

జుమీలియా (జుమల) — బిన్నాతుకుకుంపుడుకత్తె.

బ్రాహ్మణి — జుమల మాఱువేసము.

దాసీ — జుమల పనికత్తె.

ఇంకను సందర్భానుసారముగా న్యాయమూర్తి న్యాయవాదులు, సార్జంటులు సబిన్స్పెక్టరులు. మఱికొందఱు దొంగలు మున్నగువారు వత్తురు.

# ఇష్టదేవతా ప్రార్థనాదికము.

ఉ. శ్రీరమణీమణీహృదయ సీమవిహార మనారతంబు శృం
గారపులీలఁ జల్పుచు జగంబున మేటి యరిందముండు నాఁ
గోరిక యోగిబృందముల గొబ్బునఁ బ్రోచుచుఁ గోరువారికిం
గోరినభంగినిచ్చునల గోపకులాగ్రణిఁ గొల్తు భక్తితోన్,

తే. గీ. కార్యమొకఁడాచరింపంగఁ గడఁగునపుడు
ముందునే దేవుఁ బూజించి మోదమలర
సిద్ధిఁబొందుదు రట్టిప్రసిద్ధపురుషు
నేకదంతు, మహాదాంతు, నే భజింతు

మ. అరయన్ బాల్యమునుండి ప్రేమమున విద్యాబుద్ధులం జెప్పి యి
ద్ధగవృద్ధిం గను మెల్లకాలమును విద్యాశాలివైయున్న యా
కరుణాసాగరు, శిష్యవత్సలుఁసదా కౌతూహలస్వాంతుమ
ద్గురు శ్రీచిల్లర వేంకటేశ్వరకవిం గొల్తున్సభక్తిన్మతిక్

తే. గీ. బాసకు మహోపకారంబు జేసి కీర్తి
కాయులైయున్న పూర్వసత్కవులఁ దలఁచి
యిప్పటి కవీశ్వరులఁ గర మొప్పఁ గొలుతు
మద్వచశ్శుద్ధి కొఱకు నెమ్మనమునందు.

మ. కవి బాలుండు కవిత్వమట్టిదకదా కాకుండునే యంచు స
త్కవులారా! నిరసింపఁ బోవకుఁడు లోకంబందుమున్మందునే
కవి వాగ్దేవిని వెంటఁ బెట్టుకొని వేడ్కంజన్మముంగాంచెఁ గం
దువులై పిమ్మటఁ బెద్దలయ్యెదరు బుద్ధుల్ నేర్చి యెవ్వారలున్.

తే. గీ. కాన నీపొత్తమందసంఖ్యాకములుగ
నెరసులుండఁగవచ్చు వానిఁ దిలకించి
సత్కవిశ్రేష్ఠులార! హర్షంబుమీఱఁ
దెలియఁజేయుఁడు భక్తితో దిద్దుకొందు



శ్రీరస్తు.

# అరిందమవిజయము.



## ప్రథమాంకము.

### 1 రంగము:—గోపాలచంద్రు అంతర్భవనము.

[ఆలోచించుచు గోపాలచంద్రు ప్రవేశించును.]

గో—మిత్రుఁ డేలొకో యింతయాలస్యము చేసియుండెను ? కారణమేమి చెపుమా ? (కొంచెము విచారించి) అతఁ డెప్పుడు నేదోయొక కార్యాలోచనాలోలుఁ డయియే యుండును. ఆకారణమున నఁ దీరిక చిక్కమి నేఁ డిటకు రామానుకొనెనేమో? ఏల మానుకొనును ? నన్ను దినమున కొక్కసారియైనను గలిసికొనకుండ లేఁడే ! ఏదేని ఘనకార్యనిర్వహణమునం దుండుటవలనఁ గొంత యాలస్యమై యుండనోపు. అయిననేమి ? ఈపాటికి బయలుదేరి వచ్చుచునేయుండును. వచ్చిన నతనితో నీవిషయ మెట్లు ముచ్చటింతును ? ముచ్చటించిన నేమి ? వాని కిట్టిచేఁతలన్న నాసక్తియు నమందానందమును గాన నే సంశయింప నవసరము లేదు. తప్పక యెఱిఁగింతును. మిగిలినవెనుక వగచిన నేమిలాభము ? (పరికించి) ఆలస్యమైనదని కాఁబోలు మిత్రుఁడు వడివడి వచ్చుచున్నాఁడు. వీని నధికముగ సన్మానించి నాగు

ట్టెటించి సఫలీకృతమనోరథుండ నయ్యెదను. (ఒకచాపుకుర్చీని దనపీఠమునకు సమీపమున నమర్చియుంచును.)

(బిన్నాతు ప్రవేశించును)

బి—ఓహో! అన్నగారొక్కరే యున్నటు లున్నది.

గో—సఖా! రమ్మురమ్ము! నీ కొఱకే యెదురు చూచుచు న్నాఁడ నీ పీఠ మధిష్ఠింపుము.

బి—ఏమిది! నాకొఱకా! తమ రెదురుచూచుట! ఆశ్చర్యముగా నున్నదే! మహారాజులకు నాతో నేమి యవసరము కలిగినది?

గో—మిత్రమా! ఆశ్చర్య మేమియు లేదు. నీ వలన సత్వర మొకకార్యము సాఫల్యము కావలయును; అది మఱొకరికిసాధ్య మగు నది కాదు. అందుకే తమరాక కెదురుచూచుచున్నాఁడను—

బి—మీ విషయంబున దేనినైనను జేయ మీ యనుచరుఁడు సంసిద్ధముగ నున్నాఁడుగదా! ఇంక సంశయమేల త్వరగా నెఱిఁగింపుఁడు.

గో.—మిత్రమా!

తే. గీ. సాధ్యమగుదానినే నాకు సాధ్య మనుచు
సాహసింపఁగ నగును న సాధ్య మయ్యు
సాధ్యతమమని కడఁగిన జగతి దానఁ
గలుగు నన్నివిధంబులఁ గష్టచయము.

బి—ఓహో! ఎంతమాట యంటిరి! మీ యనుచరుని యఘట నఘటనప్రతిభావిశేషంబులు తమ రెఱుంగనివా? ఏల తెలియనట్లు భాషించెదరు? చూడుఁడు.

చం. పొడవడఁగింతుమంచుఁ గసిఁ బూని డిటెక్టివులెంద ఱెందఱో
మడిసిరి నన్ను డాసి యతి మాంత్రికము పుద్వాలు పన్నిడాసి వే
యడఁగువిధానఁ గొట్లుగల యట్టిమహామహాభాగ్యశాలురే
యడుగిసలు గొల్తు రెంతయుభ యావృతమానసులయ్యునిత్యముఁ.

మఱియును—

తే. గీ. చెప్పి చేసితిఁ గూనీలు ♦ సెల్లు ననుచుఁ
జెప్పి దోచితి నగరంబు ♦ లొప్పుననుచు
నిప్పుపెట్టితి తాణాల ♦ గొప్ప యనుచుఁ
జెప్పశక్యమె నేఁజేయు ♦ చెయిదము లహా!

ఇట్టి భయంకర కార్యనిర్వహణవిద్యాపారీణుండ నగునీమీాసంగడీనిమొను ట నింక శంకితాంతరంగులై జంకుచుంటి రేల? అవశ్య మెఱిఁగింపుఁడు.

గో—మిత్రమా! నీయసహానప్రజ్ఞాపాండితీవిశేష మే నెఱుంగినిది కాదు; కాని—(అర్థోక్తిలో)

బి—అదిగో! మీా రింక నాయెడ శంకనే సూచించుచున్నారు.

గో—శంక యేమియు లేదు.

బి—లేకున్నఁ జెప్పఁబోయినదాని నడ్డుపఱచితి రేల?

గో—మిత్రమా! స్వకార్యనిర్వహణమునందుండుశ్రద్ధ పరకార్యములయం దుండదేమో యని—

బి—నెచ్చెలీ! నీవట్లెన్నఁటికిని దలంపవలదు. కార్యసాధనపరునకు స్వీయమైననేమి? పరకీయమైననేమి? అట్టివిచక్షణగలవాడాపనికిఁ గడంగుటయే యసంభవము, ననుచితమును.

గో—సఖా! భేదభావములేక స్వకీయమట్లు నెఱవేర్తు నని—

బి—ఏమీా! ఒట్టును బెట్టుకొనుమనియా మీాయభిప్రాయము?

గో—ఔ నదియే నాకోరిక.

బి—సరి! ఇదిగో (చేతిలోఁ జేయివైచును)

గో—(సంతోషముతో) మిత్రమా!

తే. గీ. తండ్రియార్జించిపెట్టివి ♦ త్తంబునందు
నన్న కెటొ తమ్ములకు నట్లె ♦ హక్కు లేదె?

నీ వెఱుంగవె మా యన్న కే నీతిమాలి
నన్నుఁ బెట్టిన యిడుమల కే న్యాయముగను.

ఇట్టి దుర్ణయుండైన మాయన్నపైఁ జిరకాలమునుండియు నాహృదయంబును దహింపఁజేయుచున్న క్రోధాగ్ని యతఁ డస్తమించినతోడనే కొంత సమసినది; కాని విశేషభాగ మట్లే నిలిచియున్నది.

బి—ఔను. దాని కిప్పు డేమిప్రతిక్రియ నొనరింప నెంచితిరి?

గో—నెచ్చెలీ! అదియే మిక్కిలి సాధ్యముగానిమెత్తు.

బి—మిత్రమా! అట్లనవలదు. సాధ్యాసాధ్యంబులు ప్రయత్నానంతరంబులు.

గో—అటులైన నెఱింగింతు నిటురండు (చెవిలో రహస్యముగా నేదియో చెప్పి) సఖా! నామీఁది కేమైనఁ దోసి యూరకుందువేమో బహుజాగరూకతతో నిర్వహింపవలయునుజుమా! ఇందు మీకీయవలసిన యిరువదివేలును నామనోరథము పూర్తిగా నెఱవేరినతోడనే తప్పక యిచ్చుకొందును.

బి—మంచిది. మీరు మాత్ర మేను నియోగించినదానిని సమయానుకూలముగా నప్రమత్తులై శ్రద్ధతో నాచరింపుఁడు. ఇంక నే నరిగి జరుగవలసినవిధాన మాలోచింతును.

గో—మిత్రమా! నాయాయువంతయుఁ దమ యఱచేతియందున్నది. నన్నెట్లు కాపాడెదరో మీయుపకార మేనాఁటికిని మఱచిపోను. పను లెంతగుప్తముగా జరిగిన నంత లాభము నాకును నీకును గూడఁ గలదు. ఎట్లు కొనసాగింతురో.

బి—మిత్రమా! నా కింతగాఁ జెప్పవలయునా? మీ యుద్యమాంకురమును బోషించుటకు నేఁడే మొదలు. సెలవిత్తురా?

గో—మంచిది. దయచేసి యథాప్రకారముగాఁ బ్రతిదినంబును నన్నుఁ గలిసికొనుచుండుఁడు.

బి—చిత్తమట్లే (నిష్క్రమించును).

గో—మిత్రమా! ఒక్కమాటయున్నది.

బి—(తిరిగి ప్రవేశించి) ఏటికిఁ బిలిచితిరి?

గో—మిత్రమా! ఒకదానివెనుక నొకటి నెగ్గుటతోడనే గూఢముగా నేదేని యొకయవయవము నాకడకు గుర్తుగా నంపుచుండవలయునని నాకోరిక.

బి—ఇందుల కేనా? మంచి దట్లే పంపించెదను.(నిష్క్రమించును.)

గో—భళిరా!

ఉ. కర్మఫలంబు నాకు సరి కేగాఁగలదేని ధరిత్రి నెవ్వ రీ
మర్మ మెఱుంగఁజాలరు స కే మస్తముఁ జేకురు నట్లు కానిచో
ధర్మము వీడి దర్వ్యరతి కే దారుణకృత్యము లెన్ని సల్పె నీ!
దుర్మతి యంచు లోకములు కే దూఱవె? కష్టము లట్టులుండఁగాక్

కానిమ్ము. లోఁటిలోఁ దలదూర్చి రోఁకటిపోటునకు వెఱవనేల? భవితవ్య మెట్లో యట్లు జరుగును. కానున్నది కాకమానదు కదా! నా నియమిత కార్యమును మాత్రము శీఘ్రతోఁ ద్వరలో నెఱవేర్చుకొనుట యే యిఁక నాపని. (నిష్క్రమించును)

2 వ రంగము:—పోలీసుస్టేషన్.

[సబ్ ఇన్స్పెక్టరగు బాబు యోగీంద్రనాథుఁడు ప్రవేశించును.]

యో—నే నీయుద్యోగమునకు వచ్చినది మొదలు నేఁటి వఱకు రక్షకభటాధ్యక్షుల నెందఱనో చూచితిని; కాని, నివారితసజ్జన దారిద్ర్యబంధురదీక్షాధురంధరుండగు నరిందముని రీతిఁ జురుకుగాఁ బనిసేయువానినేఁ జూచి యెఱుంగను. అబ్బా! ఏమి యూహాపోహలు! ఏమి తెలివితేటలు! ఎంతబుద్ధిసూక్ష్మత! ఎంతధైర్యసంపద! ఎట్టి కార్యదీక్ష! ఆహా! ఆ మహామహునిచేఁతలు స్వయముగాఁ జూచితీరవలయును; గాని చెప్పుటకు సామాన్యమానవకోటికి వలనుపడవు.

ఆతఁ డిక్కడకు రాకమునుపు గంపెడు కేసులతో దుంప తెగి యాలో చనాసాగరంబునం బడి యీఁదులాడుచు నెటుపోదమన్నను దెన్నుఁ గానక సరియైనవేళ కన్న పానములు లభింపక కంటినిండ నింతనిద్రపో పుటకైనను వీలుకలుగక యహర్నిశము లేదో యొకవ్యవహారమునంబడి కొట్టుకొనుచుండెడివాఁడను. ఇప్పుడో లెక్కకొక్క కేసైననుఁ గానఁబడదు. ఎంత మేలు! ఎంత సౌఖ్యము! ఎంతవిశ్రాంతిఁ గూర్చినాఁడో చూడుఁడు.

[పెట్టె నెత్తిపైఁ గలయొక మనుష్యునితో రామదీన్ ప్రవేశించును]

మో—రామదీన్! ఎవరీమనుష్యుఁడు? పెట్టె యేమి?

రా—అయ్యా! వీఁడెవ్వఁడో యనుమానస్థుఁడుగా నుండుటచే నిచ్చటికిఁ దీసికొనివచ్చినాను. ప్రభువుల చిత్తము.

మో—ఎవ రబ్బీ నీవు?

కూలి—అయ్యా! నేను కూలివాఁడను.

మో—నీ కాఁపురస్థల మే యూరు?

కూ—భోజపూర్.

మో—ఇప్పు డెక్కడికి వెళ్లుచుంటివి?

కూ—ఇక్కడికే.

మో—ఇక్కడి కనఁగా నెక్కడికి? ఈ స్టేషనులోని కేనా?

కూ—కాదు! కాదు! ఎవరో అరిందమబాబుగారఁట; వారి యింటికి.

మో—ఎవరు పంపిరి?

కూ—కలకత్తాలో నెవరో వారిస్నేహితుఁ డఁట.

మో—కలకత్తాకును మీ యూరికి నెంతదూర మున్నది?

కూ—దాదాపు పదిమైళ్లదూర మున్నదండి.

మో—అంతదూరమునుండి వచ్చి కలకత్తాలోఁ గూలిపని చేసెదవా?

కు.—లేదండి. నాదారపుత్రాదులను బోషింపలేక కష్టపడుద మన్న౯ గూలికిఁ బిల్చువారైనను౯ గనఁబడకపోవుటచేఁ బట్టణములోనే కూలిపనియైనను౯ జేసికొని జీవింపవచ్చునని మొన్న మొన్ననే వచ్చి వారియాతాలోనే యున్నాను.

మో.—ఎవరి యాతాలో ?

కూ.—ఈ పెట్టెను బంపినవారి యాతాలోనే.

మో.—ఇం దేమి యున్నది ?

కూ.—ఏ మున్నదో నేను జూడలేదండి బాబు !

మో.—ఉత్తర మిచ్చి పంపెనా ?

కూ.—లేదండి బాబు ! పేరు మాత్రము చెప్పి వారి కిచ్చి రమ్మన్నాఁడు.

మో.—తాళము వేసినట్లున్న దే. తాళపుఁజెవి యిచ్చి పంపెనా?

కూ.—ఇయ్యలేదండి.

మో.—సరే. నీ విచ్చటనే యుండుము.

కూ.—అయ్యా ! వారి నిచటికిఁ బిలిపింతురా యేమి ?

మో.—ఇంకొకగడియలో వారే యిచటికి వత్తురు. అంతదనుక నీ వీపెట్టె నాగదిలోఁ బెట్టి యీయరుఁగుమీఁదఁ బండుకొమ్ము.

కూ.—చిత్తము (పెట్టెనులోపలఁ బెట్టి బయటికి వచ్చును.)

రామదీన్ ! నీపనికి నీవు వెళ్లుము.

రా.—చిత్తము. (నిష్క్రమించును)

మో.—అబ్బే ! నీ విక్కడనే యుండుము. (లోనికిఁ బోవును).

కూ.—(స్వ) తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచునన్నట్లు నేనన్నినన్నాగ మంతయు నిచ్చట వ్యర్థమగునట్లున్నది. ఏమి చేయుదను ! ఎటుపోదమన్నను వీలు గాకున్నది. రక్షకభటు లన్నిదిశలను సంచారముచేయుచున్నారు. ఈలోపల నరిందముఁడు వచ్చెనా నేని

క్కడఁ జెల్లుకొనవలసినవాఁడనే. కానిమ్ము. విచారపడిన నేమిలాభ
ము ? ఇచ్చటనే పరుండి సమయము నిరీక్షించుచుందును. తరువాత
నేమికాఁగలదో దేవునికే యెఱుక. (పరుండును తెరపడును).

[3 వరంగము.—జీవనపాల్ తోట కేశవచందు ప్రవేశించును]

కేశ—ఈయధికారవర్గమువారు నిశ్చయముగాఁ బిరికిపందలు;
కానిచో,

తే. గీ. దశసమలనుండియును నాదు కౌర్యములను
నించుకేనియు గుర్తింప, కారేరివలన
నింతదారుణకృత్యంబు కెసఁగుచున్న
వనియుఁ జర్చింపరిది యెంత కైన్యమొక్కో.

ఈకాలంబునఁ గేవలము ధనార్జనముకొఱకే యావజ్జీవము యావచ్ఛ
క్తి నుపయోగించుచున్న వీరిపట్లఁ బరోపకారము, వాత్సల్యత, కరు
ణయను నవి యెట్లుసార్థకమగును? ఇప్పుడిప్పుడే నూతనముగా డిటె
క్టివుపనిఁ జేయుచున్న యాతఁడించుక మేధావియుఁ గార్యసాధనా
పరుఁడునుగాఁ గనిపించుచున్నాఁడు. కానిమ్ము, ఎంతమేధకలవాఁడై
నను (మీసము సవరించుచు) ఈసింహముతో నెవఁడు చెరలాట మా
డఁగలఁడు? పోనీ! వారియల్పజ్ఞత నేనిట విమర్శించు టేటికి? నేఁజేయు
చున్నకృషినిగుఱించి యించుకయోజించెద. (కొంచెము సేపాలోచించి
నేఁదలఁచినట్లు కార్యము లనివార్యములుగా సాగుచున్నవి; కాని
పెట్టెనెత్తుకొనిపోయిన మాగారి యింతయాలస్యమేలచేసి యుండును
అధికారులేమేని నామర్మమెఱిఁగి నిర్బంధించి యుండిరా? నిర్బంధిం
పఁబడుటకంత యవివేకముతో మెలఁగువాఁడుకాఁడే! యుక్తుల నా
కుం దీసిపోనివాఁడే. కారణమేమైయుండును? నేను యోగీంద్రుని
వ్రాసినజాబు గారికన్నముందే ఠాణాకుఁజేరియుండునా ? ఎట్లుచే
యుండును? నిన్న టపావెళ్లినవెనుకఁ గదా నేనాయుత్తరమును దప

లాపెట్టెలో వేయించినది! నేఁడింకఁ డపాసమయముగూడఁ గాలేదే! ఏమిది! వామసంబెందును బాలుబోక చేయిపెట్టి కలచునట్లున్నదే!

కం. ఇంతకు మామర్మము నిసు
మంతయు గుర్తెఱిఁగిరేని కే నార్జించిన యా
కొంతధనము పోఁగాఁ బెను
వంత లలముకొనును నింద కే పైకొనునంతన్.

జరుగనున్న గథావిధాన మడుగంటుటయే కాక ప్రభుత్వోద్యోగీయులు దమ ప్రాణము లున్నంతవఱకు మాత్రము మమ్ములను విడువరు. ఎత్తినది గొప్పయెత్తు; కానున్నది ఘనకార్యము. ఇది ఫలించినఁ బాదుషా నగుటయో, ఫలింపకున్నఁ బకీరునగుటయో యీరెంటిలో నొకటి పర్యవసానమునఁ దేలవలసియున్నది. (అటునిటుచూచి) ఎవ రావచ్చెడివారు? ఓహో! మాగారివలెనే యున్నాఁడు. నిశ్చయముగా నతఁడే. (కొంచె మెదురేగి కౌఁగిలించుకొని గారీచంద్‌తోఁ బ్రవేశించును)—

కే—ఏమింతయాలస్యము చేసితివి? నిన్నెవరైన గుర్తించిరా?

గా—గుర్తింపలేదు; కాని యనుమానము మాత్రము పడిరి.

కే—ఎచ్చట?

గా—పోలీసుస్టేషన్ దగ్గఱనే.

కే—అనుమానపడినదెవరు?

గా—రక్షకభటుఁడు రామదీన్.

కే—వాఁడా? హెడ్‌కానిస్టేబిల్ పదవినుండి క్రిందికి జాఱినవాఁడా?

గా—ఔను. వాఁడే.

కే—అనుమానపడి యతఁడు నిన్నేమిచేసెను?

గా—ఏమిచేసెనా?—

ఉ. ఎక్కడిదియూరు, నీవెవఁడ? వెచ్చటికేగుచునుంటి విప్పుడి
ట్లొక్కట, నెందుఁజుట్టఱికమ్ము మున్నది నీ, కెవరంపుచుండి రీ
బొక్కస మెల్ల నేమిటను? బూరితమయ్యె నెఱుంగఁజెప్పు మిం
దొక్కటిమైన పీడకమె? యున్నది యున్నటులం గ్రమంబుగన్

అని యీ మొదలుగాఁగల యనేక ప్రశ్నంబుల నన్నడుగసాగెను. నేను నప్రమత్తుఁడనై యతఁడడిగినదానికిఁ దగినట్లు ప్రత్యుత్తరంబు లిచ్చితిని.

కే—సరే! నిన్నంతట విడిచిపెట్టెనా?

గా—లేదు! లేదు! స్టేషనులోనికి వెళ్ళవలయుననియు సబ్ ఇన్‌స్పెక్టరుగారి యనుమతిపై వెళ్ళవచ్చుననియుఁ జెప్పి బలవంతముగా నన్ను లోనికిఁ దీసికొనిపోయిరి.

కే—అక్కడఁ బెట్టె నేమైనఁ బగులఁగొట్టిరా?

గా—పగులఁగొట్టినయెడల నన్నిటకు రానిత్తురా?

కే—మఱి యేమి జరిగెను?

గా—ఆపిచ్చిబాబుకూడఁ బైవిధముననే నన్నుఁ బ్రశ్నించెను. నేనును బైవిధముననే జవాబులిచ్చితిని.

కే—అతఁడు నీపల్కులను విశ్వసించి వదలిపెట్టెనా?

గా—లేదు! లేదు! నే నిచ్చు జవాబులలో వారిస్నేహితుఁ డీ మందసము నరిందమబాబుగారి కిచ్చిరమ్మని నన్నంపెనని చెప్పఁగా నాపలుకులు నిజమనియో లేక యరిందముఁడచటికి వచ్చినపిదప నిజముదేలుననియో మఱేకారణమువలననో కాని పెట్టెనుమాత్రి మాతని యాఫీసుగదిలోఁ బెట్టించి యటనున్నతిన్నెపై నన్నుఁ బరుండనియమించి తాను లోని కేగి తనపనిని జూచుకొనుచుండెను.

కే—"అడుగులోనే హంసపాద" మన్నట్లు మొట్టమొదటనే గట్టిచిక్కులోఁ దగుల్కొన్నాఁడవే! పిమ్మట నేమైనది?

గా—ఏమైనదా? మిమ్ములను దర్శించుట యైనది.

కే—(నవ్వుచు) ఔను లే. ఆబోనులోనుండి వెలుపలి కెట్లు వచ్చితివి?

గా—చెప్పెదను వినుము. నే నట్లు చిక్కుపడి యధి కారవర్గ మునకు వెఱచి యెట్లు తప్పించుకొందమన్నను వీలుకలుగక సమయము కొఱకు నిరీక్షించుచుంటిని. ఇంతలో రాజవీధిని నేదియో గల్లంతు జరుగుటచే నట నేమైన రెండుడబ్బులు లభించుననియో నామాట జ్ఞప్తి యుండకయో కాని యటనున్న భటవర్గ మెల్ల నొక్కసారి రివ్వునఁబరు గెత్తుటచే నదనిదియే యని మెల్ల మెల్లఁగా నేనటనుండి తప్పించుకొని బయటికివచ్చి యొక్కనిమిషములోపలనే మిమ్ము దర్శించి నాకు నియమించిన కార్యములోఁ గొంచెమైనను లోటురానీయక మీమన్ననల కుఁ బాత్రుఁడనైనందులకు సంతసించుచున్నాను.

కే—మిత్రమా! నీవంతటివాఁడవనియే కదా! నిన్నీదుర్ఘటకార్యమునకు నియమించినది?

గా—ఏమోలెండి. మీదయవలనఁ జచ్చి మఱొక్కతల్లి గర్భమునఁ బుట్టివచ్చినట్లు వచ్చి మరల మిమ్ముఁ గలిసికొంటిని. నాకదియే సంతోషము. (ప్రక్కకుఁ దిరిగిచూచి) భవాజీ! రమ్ము! రమ్ము! విశేషము లేమి?

భవా—(ప్రవేశించి) విశేషము లేమియులేవు. మనమనుకొనినదానికి లోటేమియులేదు.

కే—ఏమీ! రెండును జరుగనిది యీయన నెనా?

గా—మనమనుకొనలేదండి. నిశ్చయముగా మీరీవిషయంబున బొరపడినారు. అప్పుడే యింత తెల్లనికాగితముమీఁద నల్లనిగీటు వేయించిన నెంతబాగుండును! ఆలోటే యింతచేసినది. ఆఁ! అంతేనా భవాజీ!

భ—అంతే. ఆమాటనుమాత్రము గూఢముగానుంచి యిం తవఱకువారిసిస్తు వసూలుకా లేదనియు గవర్నమెంటువారిసిస్తు ముం దుగాఁ గట్టవలసివచ్చుటచేఁ గోశములు వట్టిపోయినవనియు రెండు మూఁడు దినములలో నీమొత్తమును వసూలుచేసి నిలువయుంచెదన నియు మీరుమాత్రము వేఱుగా భావింపక యీలోపల నీకొంతే నుగూడఁ దీర్పుఁడనియుఁ బదింబది లాలుగారికి నాకూరుగా మనవిసే యుమని చెప్పెను.

కే—నీవు కొనిపోయిన గుస్తను విశ్వసించెనా?

భ—ఆ. విశ్వసింపకేమి? అందున్న కొన్ని మచ్చలంబట్టి నమ్మ టయేకాక యతఁడాక్షణమునఁ బొందిన సంతసమునకు మేరయేలేదు.

కే—ఇంకనేమైనఁ జెప్పెనా?

భ—ఆ! చెప్పెను. వినుఁడు నేఁజెప్పంబోవునవి రాజుగారి ప ల్కులు; "ప్రియమిత్రమా!

ఉ. కాంచితి నీవు పంపినది కన్నులపండువుగాఁగ నాత్మ హ
ర్షించితి నీసమర్థత గుణించి విశేషముగాఁ గొంత సా
ధించి మదీయవాంఛితము దీర్చి యనంతరమేను గూర్మిఁ గా
వించెద నట్టిమన్ననల వేగమపొందుము వేడ్కనెచ్చెలీ! "

కే—మంచిది. మీరెల్లరు నేఁటిరాత్రి గాంధారి మాంధాః పొద్దునఁ బాతాళభవనమున సమావేశముగండు. కర్తవ్యమాలోచిం చి తగిన విధానమునకుం గడంగవలయును.

గా—చిత్తము. తమరిపుడు తమిజుద్దీనుకడకరిగెదరా?

కే—ఔను.

గా—ఆతఁడు మనమనుకొనిన గడువులోపల నెగురునా? లేః మన ప్రయాసమంతయు నిరర్థకమౌనా?

కే—ఏల నిరర్థకమాను. శనిపూనిన నేను సంవత్సరములకు మనము పూనిన జన్మాంతమునకుఁ గదా వదలుట.

గా—ఔను; గాని గడుసుమున్న గుల్‌సుమ్ కంటఁబడకుండ మెలఁగవలయును.

కే—గడియ గడియకుఁ జక్రి మెట్లు త్రిప్పవలయునో యట్లు త్రిప్పుచుండ నాబిడ తెలిసికొనుటయే? అదికలలోనివార్త.

గా—సరే వెళ్ళిరండు. రెండుజాములగుచున్నది.

కే—మంచిది. (తలకొకదారి నందఱునిష్క్రమింతురు.)

4 వ రంగము:—పోలీసుస్టేషన్—సబ్ ఇన్‌స్పెక్టరగు యోగీంద్రనాథబాబు ప్రవేశించును.)

యో—(స్వ) అన్నన్నా! ఎంతమోసము! ఎంతమోసము! చూచుచుండఁగనే కన్నులలో మన్నుగొట్టి పోయినాఁడే! అబ్బా! ఎంత మాయ! ఎంతయుక్తి! ఎంతశక్తి! ఎంతచాకచక్యము! ఎంత నేర్పరితనము! ఆహా!

ఉ. కూలికివచ్చితంచుఁ గడుఁ గొంకుచు సిగ్గుతుఁ దైన్యమొప్పగా
వేలకువేలుపల్కి యొక కీసమునైన నిజస్థితింగనన్
వీలునొసంగకుండ నను వేగమ మోసము నెంతచేయఁగాఁ
జాలెను జూచుచుండఁగనె చత్తువుల దగమూసి యద్దిరా!.

ఇదివఱకెందఱినో యిట్టిబడాచోరులను వేనవేలు చూచియుంటిని; కాని, అబ్బా! మాకింతనేర్పరితనముతోఁ బంగనామములను బెట్టినవాని నెక్కనినైనను జూడలేదు. ఆహా! ఎంతయూహా! ఏమామాటలపొందిక! ఎట్టిధైర్య సాహసములు! వీనివర్తనమంతయు నిట్లుండఁ బెట్టెమాత్రి మరిందమ బాబుగారి దేలయగును? దీననేముండెనో పగులఁగొట్టి పరీక్షించెదఁగాక (పెట్టెతాళమును బగులగొట్టి యందొకశవముండుట జూచి యాశ్చర్యముతో) అరరే! ఏమిది! ఏమిది! శవమువలెనున్నదే!

(పరికించిచూచి) ఆ. ఏమి! ఒకహ స్తముగూడ ఖండింపఁబడియున్న దే! ఈహత్యఁగావించిన దుర్మార్గుఁడెవ్వఁడు? ఈనవమోహనాంగి నిట్లొన రించుటకుఁ జేతులెట్లాడెను? మానసమెట్లొప్పెను? ధైర్యమెట్లుకలిగె ను. (మరలఁజూచి) ఆహా!

ఉ. ముద్దులుమూటఁగట్టు నగు ౯ మోమునశోణితమొల్కికుంకుమం
దిద్దినయట్లు పొల్పెసగె ౯ దేహమయారె! పదాఱువన్నెలం
దద్దయునొప్పు మేల్పసిఁడి ౯ నాఁగ ధగద్ధగ వెల్గుచుండె నీ
ముద్దియనిట్లుచేయుటకు ౯ మూర్ఖులకేమిట నెగ్గుసల్పెనో?

ఆహా! ఈబాలికామణి మృతకళేబరమే యింతయందముగా నుండ జీ వించినప్పుడెంత హృద్యముగానుండెనో వేఱయడుగవలయునా? మన కవులు వర్ణించు పద్మినిజాతిలో నీకుమారి సౌందర్య మగ్రస్థానమును వహించియుండనోపు. కనుక నే పద్మగర్భుఁడిట్టి యల్పాయువుంగూర్చి నాఁడు. అబ్బా! విధికృత్యంబు లెంతయక్రమంబులు?

ఉ. చారుమనోజ్ఞరూపము ప్ర ౯ శస్తతరంబగుమేధ కల్గు నే
పూరుషునైన స్త్రీనయిన ౯ భూతధరిత్రిని బెద్దకాలముం
గోరి మనంగనీయఁ డతి ౯ కుత్సితు నంగవిహీను నింద్యుని౯
మీఱి నిశాకరార్కముగ ౯ మేదిని నిల్పు శిలాక్షరంబుగ౯.

ఇంతియె కాక,

తే. గీ. రూపవంతుని కరయఁ గు ౯ రూపిఁ గూర్చు
రూపసికిఁ గూర్చు నెందు వి ౯ రూపు నిట్టి
రెండునుం గూడి యున్నచో ౯ నెండొరులకుఁ
గిట్టకుండఁగఁ గూర్చు నిం ౯ కెట్టులకట!

ఛీ! ఛీ! సృష్టికర్త యిట్టి యసందర్భములను గ్రహింపలేక లోకం బున నెందఱిచేతనో మిగుల దూషింపఁబడుచున్నాఁడు గదా! కానిమ్ము; దైవనిందితము నాకేల? వరుసగా నలుగురభటులు నంపినను అరిందము

డేలొకో యింతయాలస్యమును జేసి యుండెను ? కారణ మేమిచెపు మా ? (వినుట నభినయించి) ఏమిది ! అరిందమబాబుగారు భోజనా నంతరమున వచ్చెదమనిరా ? సరి ! సరి ! నీపనికి నీవు పొమ్ము (ఏమే మో వ్రాసికొనుచుండ నింతలో నరిందముఁడు ప్రవేశించును.)

యో—ఓహో ! దయచేయండి.

అ—మిత్రమా ! వరుసగా నిన్ని కబురు లంపితి రేటికి ?

యో—ఇది కబుర్ల కాలమేకదా !

అ—ఏవిషయముంగూర్చి ? (అచ్చటనున్న పెట్టెపైఁ గూర్చుం డఁబోవును.)

యో—వలదు. వలదు. ఆ పెట్టెమీఁదఁ గూర్చుండవలదు.

అ—(కూరుచుండక నివ్వెఱపడి చూచుచు) దీన నేమున్నది ?

యో—ఉన్నదే ఉన్నది. జరుగవలసినదే జరిగినది. చూడుఁడు (మందసము మూఁతఁ దెఱచును.)

అ—(ఆశ్చర్యముతోఁ జూచుచు ముక్కుమీఁద వ్రేలుంచు కొని) అరరే ! యీనవమోహనాంగిని ఈముద్దులమూటను. ఈ నవ్వు లమొలకను ఈ జగన్మోహినిని—ఈ రూపలావణ్యతారుణ్యాగ్రగణ్య నెవ్వడింతచేసె ? ఇట్లొనరించుట కా హంతకునిచేతు లెట్లాడె ? అక్క టా ! ఇది యెంతకౄరము ? ఎంతభీభత్సము ? ఎంత దుస్సహము ?

యో—బాబూ ! తమరిచ్చటికి దయచేసినది మొద లిట్టిచిత్ర వధ యెచ్చటను గాంచియుండలేదు. ఇదియే ప్రప్రథమము.

అ—అయ్యో ! ఈ కూనీ యెక్కడ జరిగినది ? మీ కెట్లు తె లిసినది ? ఎప్పుడు పట్టుకొంటిరి ?

యో—బాబూ ! ఎక్కడ జరిగినదో మాకుఁ దెలియదు. ఎ వ్వరును జెప్పియుండలేదు. మనయెదుటివీధిలోనే పట్టుకొంటిమి.

అ—ఆ. ఏమేమీ ? మన యెదుటి వీధిలోనే ?

మో—ఎదుటివీధి యేమి ; మనఠాణా గుమ్మముదగ్గఱనే.

అ—ఎట్లు పట్టుకొనఁగలిగితిరి ?

మో—ఈపెట్టెను నెత్తిమీఁదఁ బెట్టుకొని వెళ్లుచున్న యీ ధూర్తుని బయటిద్వారమునకడ నున్నమనరామదీన్ పరికించి చూచి వన్మిందగనివాఁడుగా నుండుటచే నా యొద్దకుఁ దీసికొని వచ్చెను. అంత నేను వానిసంగతి నంతయు నడుగఁగా.

కం. కలకత్తాలోఁ దమనె
చ్చెలి యెవ్వఁడో పంపె ననుచుఁ జెప్ప నతనిప
ల్కుల సత్యాసత్యంబులు
దెలియక యిందుంచినాఁడ దీనిని మిత్రా!

అరిం—ఆఁ! ఏమి నాకేనా దీని నంపినది. పంపినవాఁ డెవఁడు! వాని పేరేమి ?

మో—తమస్నేహితుఁ డఁట! పేరెఱుఁగఁ డఁట. ఉత్తరమైన నిచ్చియుండలేదు. ఇట్లన్నియు నసందర్భములుగా నుండుటచేతఁ దక్షణము శిక్షింపఁ బడఁదగినవాఁడుగా నున్నను, దమకేయనుటలోఁ గొంచెము వెనుకంజవేయవలసివచ్చెను. అంత నేనతని నిక్కడనే యుండుమనియు. అరిందమబాబుగా రిక్కడికే వచ్చెదరనియును జెప్పి యీ మందస మిటఁ బెట్టించి మీకుఁ గబురంపితిని.

అరి—వాఁ డిపు డెచట నున్నాఁడు ?

మో—ఇం కెచటనున్నాఁడు ! వాని నీ యరఁగుమీఁదఁ బరుండి యుండుమని చెప్పి లోపల నాపని నేను జూచుకొనుచుండఁగా వాని పని వాఁడు చూచుకొనినాఁడు.

అరిం—అబ్బా! ఎంతపన్నిఁజ! పగలే మిమ్ము మోసపుచ్చినాఁడే!

మో—(పెట్టెనుజూపుచు) ఇంతపనిఁ జేసినవానికి మోసపుచ్చుట యన నెంత ?

అరిం—పోస్టాఫీసునకు రామదీను నంపితిరా ?

యో—ఆ. పంపినాను. చాలసేపైనది (వచ్చుచుండుటఁ గాంచి) అదిగో! వచ్చుచున్నాఁడు.

రా—(ప్రవేశించి) అయ్యా ! ఉత్తరము లివిగోనండి.

యో—ఈ బల్లమీఁదఁ బెట్టి వెళ్లుము.

రా—చిత్తము. (వారియెదుట బల్లమీదఁ బెట్టిసిష్క్రమించును) (అరిందమ యోగీంద్రులు వరుసగా నన్నియుత్తరములను జూచుచుందురు. యోగీంద్రుఁ డొకయుత్తరమును గొంతవరకుఁ జదివి నిశ్చేష్టితుఁడై యుండును.)

అరిం—ఏమండి ! ఏమి చదువుట నాఁపి పెద్దగా నాలోచించుచున్నారు ?

యో—చూడండి. చక్కగా విచారించి యెవఁడో మనమీఁదికే దాడి వెడలినాఁడు.

కం. తా నిరువదికూనీలను
మానక యొనరించునంట మాసాంతములోఁ
బూనం బ్రథముఁ డరిందముఁ
డేనఁట కనుఁగొనుఁడు దీని నెంతయు శ్రద్ధన్.

(ఉత్తర మిచ్చును.)

అరిం—(అందుకొని చదువును.)

పాతాళభవనము.

యోగీంద్రా ! తేది—నేఁడు

ఇందలియంశములను ముఖ్యముగా గమనించి నీమిత్రుఁడైనయరిందమునికిఁ గూడఁ దెలియఁజేయుము.

(సూచన.)

3

నీ వెవ్వఁడవైనదియు, నే నెవ్వఁడనైనదియు మన మిరువురమ న్యోన్యముగా నిదివఱకే గ్రహించియున్నాము ; కాని మందమతి వగు నీవు గౌరవనీయ మగునధికారపదవిలో నున్నను నిత్యము నేనొనరించు భయంకరచర్యలను గనిపెట్టలేకయున్నావు. ఇదియెంతయు హాస్యాస్పదము. ఇఁకమీఁదటనైనఁ జురుకుగాఁ బనిసేయుచు నీ క్రిందివిషయములను జక్కఁగా విమర్శించుకొని జరుగనున్నవిధాన మాలోచించుకొనుఁడు.

(ముఖ్యవిషయములు.)

(1) ఈ చిన్నది యెవతె; (2) ఏటికిఁ జంపఁబడినది ; (3) నేనే చంపనేల ; (4) చంపియు నేయుద్దేశముతో నీశవమును బెట్టెలో నుంచి నీకడ కంపితిని ;—అను నీవిషయములఁ జక్కఁగా వితర్కించుకొని నిజము గ్రహింపఁ బ్రియత్నించినను నీ సమంత కూపీనైనఁ దీయలేవు సరిగదా తుదకు నన్నైనను బట్టలేవు; ఒక వేళమీస్నేహితుఁడైన యరిందమునిసాహాయ్యముఁ గోరెదవేమో. ఒక్కయరిందముఁడే కాదు. వేయిమంది యరిందములైనను నన్నేమియుఁ జేయఁ జాలరు. ఇంతియే కాక యీ మాసాంతములో నేఁ జేయనున్నకూపీ లిరువది. అందు మొదటివాఁ డరిందముఁడే. అతఁడు మాత్రి మీయుత్తర మందినయుత్తరక్షణమునుండి జాగ్రత్తగా మెలఁగవలయు నని చెప్పుము.

(ముగింపు.)

వ్రాయవలసినవిషయము లింకఁ గలవు ; కాని యిప్పు డంత యవసరములుగాఁగన్పట్టకుండుటచే దీనినింతటితో ముగించుచున్నాను.

ఇట్లు.

మీకుత్తుకలందీయు కత్తి

(అరిందముఁ డాలోచించుచుండును.)

మో—బాబూ! ఈ దుండగీఁ డెవ్వఁడైయుండనోపు? నన్నుఁ దా నెఱుఁగునఁట. నే నతని నెఱుఁగుదునఁట. నే నెఱిఁగిన వారిలో నిట్టి ప్రజ్ఞ కలవాఁ డెవ్వఁడును లేఁడు. ఎప్పుడైన నొకవేళఁ జూచియుంటినేమో. ఇప్పుడుమాత్రము స్మరణకు వచ్చుట లేదు. నా సంగతి నటుంచుఁడు. తా నొనరించు హత్యలలో మిమ్ముఁ బ్రథములఁగాఁ బరిగణించినాఁడే. మీ కంతటి విరోధు లెవరేనిఁ గలరా?

అ—అయ్యా! నాకు విరోధుల కేమి తక్కువ.

ఉ. చోరులు, జూదగాండ్రు, మదిఁ సుంతయు జాలిమెలేక హత్యలం
గ్రూరత నాచరించు చెడుఁగుల్, ఖలు లాదిగ నెంద తెందరో
వైరులు నన్ను నిత్యము ధృఁవంబుగ మ్రింగఁగ వేచి యుండ నం
దేరి నమిత్రుఁడంచువచిఁ యింపఁగనొప్పును జెప్పు మిత్రుఁడా!

మో—అయ్యా! వీని ప్రగల్భములం జూడ మనకుఁ జిక్కఁడని తోఁచెడిని.

అరిం—అట్లెన్నఁటికిని దలంపవలదు. సాధ్యమగువఱకు శక్తి వంచనలేక ధైర్యముతో మనము పాటుపడవలయును. జయాపజయంబులు మీఁదట విధినిర్ణీతములు.

మో—సరే! మనమిప్పు డీశవము నేమి చేయుదము?

అరిం—దహింప నాజ్ఞ యిండు. మీఁదటఁ గర్తవ్య మూహింతము.

మో—మంచిది. (పెట్టెలోఁ జూచి) బాబూ! ఇం దేమో యున్నటులున్నది. తిలకింపుఁడు.

అరిం—(చూచి యందున్న యంగరఖాయును జేతికఱ్ఱను బయటికిఁ దీసి) యోగీంద్రా! మనకీవస్తువులం బట్టి కొంత భోగట్టా రాఁగలదు.

మో.—ఎట్లు ?

అరిం.—మిత్రమా ! ఈచేతికఱ్ఱ హంతకునిదే. మైనమొనల నత్తడైదమగుల నాలుగంగుళములకంటె నెక్కువపొడవుండదు. అంగీయును గఱ్ఱయు నలుపుగానుండుటచే నతఁడెఱ్ఱనివాఁడనియును గ్రహింపనగును. అంగరఖానుబట్టి పెద్దవక్షస్స్థలముగలవాఁడనియు వలనైనమెడగలవాఁడనియును దెగియనగును.

మో.—చేతిగుండీల క్రేవ గుండ్రనివెండ్రుకలు చుట్టుకొనియున్నటు లున్నవి. చూడుఁడు.

అరిం.—(చూచి) ఔను ! హత్యఁగావించునపు డించుక రక్తమొలికి నెత్తిమీఁదఁ బడుటచే దానిని దుడుచుకొనునపు డవి తగుల్కొని యుండును.

మో.—తలవెండ్రుక లే యని చెప్పనేల? మీసపువెండ్రుకలు కాఁగూడదా, గడ్డపువెండ్రుకలు కాఁగూడదా ?

అరిం.—కావచ్చును ; కాని మీరుచెప్పిన వెండ్రుకలు మిక్కిలి కఱకుగా నుండును. ఇప్పుడివి మృదువుగానుండుటచేఁ దలవనిపోల్చితిని.

మో.—ఇంక నేమైన భోగట్టా రాఁగలదేమో చూడుఁడు.

అరిం.—(ఆశవము నటునిటు త్రిప్పి తల నుంచుకొన్న రెండు ముండ్లను బైఁట కొంగుపై నున్న యొకచాకలిగుఱుతును జూపుచు) అయ్యా ! ఇవికూడ మనకుపయోగకరములే; కత్తెర నిటు తెండు.

మో.—(కత్తెర నిచ్చును.)

అరిం.—(ఆచాకలిగుఱుతును గత్తిరించుకొని) అయ్యా! నే నిఁక వెళ్ళవలయును.

మో.—ఎచ్చటికి ?

అరిం.—ఈవిషయమై కూపీని దీయుటకే.

మో.—నాయవసర మేమైన నుండునా ?

అరిం—మీరుకూడ నాకుఁ దోడుగా నుండవలయును; కాని ుప్పుడుమాత్ర మవసరము లేదు. వెంటనే మీరీమృతకళేబరచ్ఛాయాపటమును దీయించి దహనక్రియ నొనర్చునట్లుచేయుఁడు.

యో—చిత్తము. మఱలఁ దమదర్శన మెప్పుడో

అరిం—మీ కెప్పు డవసరమైన నప్పుడే.

యో—చిత్తము—(ఇరువురు నిష్క్రమింతురు.)

ప్రథమాంకము.





శ్రీ

# అరిందమ విజయము.

## ద్వితీయాంకము.

[జీవనపాలు తోఁట పరిసరమునఁ గేశవచంద్రు ప్రవేశించును.]

కే— ఆహా! లోకంబున రూపలావణ్యంబులు గలస్త్రీ
నంబుల ననారత మెందఱినో చూచుచుంటిని; గాని రేవతిని బోలి
సౌందర్యవతి నెందును గాంచియుండలేదు. భళిరా! ఎంత సుంద
మైన యాకృతి! నాయట్టిగట్టిమనస్సుగలవాని సైతమొంతలోఁ దనవ
ల్చూపులచేఁ గరఁగించి నీరుచేసి తనకు దాసీఁడునౌటకు సిద్ధునిగా
జేసికొనినది. వహ్వా! సౌందర్యమన్ననిట్లుగదా! యుండవలయు!

చ. చలువలఱేనితోడ నెక ♦ సక్కెములాడెడు మోముగోను చెం
గలువల నేలు నేత్రములు ♦ కంబుసమంబు గళంబు డంబు న
దుప్పిల నిరసింపఁజాలిన యు ♦ రోజము లుండెను లేదో యంచు శ
కలఁ గలిగించుమధ్యము న ♦ ఖంబు లుడుల్ తనువెల్ల స్వర్ణమే.

ఆహా! ఇట్టిసౌందర్యరాశిని జేతులారఁ జంప నెట్లుసాహసింతును! ఒక
శఁ జంపుదుననుకొన్నఁడు. నాకీయిరువదివే లిరువదిపూటలకైనను గం
గాసము కావుగదా! ఈకొంచెములాభమునకై శాశ్వతసౌఖ్యము
నేలచెడఁగొట్టుకొనవలయు? ఇట్టులే బ్రతిమాలుచుండఁ గొన్నిదినము
లకైనను సమ్మతింపకుండునా? నేనుమాత్రమీవిషయమును గుప్తము

గానుంచి నామిత్రులకేరికిం దెలియకుండ నటించి యీమోహనాంగి నెల్లని నావలలోఁ బడవైచుకొని యాబిడకున్న జమీాందారియాస్తి కంతయు నేనే నాథుఁడనై సుఖపడియెదఁగాక. ఎన్నిదినములిట్లు వారు లుకొట్టుకొని బ్రిదుకుట. కర్మఫలము సరిగానుండుటవలన నింతవఱకే ముప్పును గలుగకయుంటిమి; కాని కొంచెముసరితప్పినచో నెక్కచి ల్లిగవ్వైకెనను బనికిరాము. ఇప్పుడే వెళ్ళి యెల్లని బ్రితిమాలుకొనియె దఁగాక. (నిష్క్రమించును.)

ఇది ప్రవేశకము.

1 వ రంగము—జీవనపాలు తోఁటలో నొకసౌధము.

[ రేవతి యొకపక్కను, కేశవచంద్రొకపక్కను గన్పట్టుదురు.]

రేవ—చీ! చీ! చండాలుఁడా! మాపినతండ్రిని గన్నతండ్రియ నియు, నీవొక పినతండ్రివనియు భావించి మాచెంగట నేనును నాచెల్లె లును నల్లారుముద్దుగా మెలంగితిమి; కాని మీారిట్టి దుర్ణయులని యొక ప్పుడును దెలిసికొనకపోతిమిగదా! మూఢా! పిల్లివలెఁ జేరి మా యిల్లు కొల్లఁగొట్టుటయేకాక మాయెడఁ దుదకిట్టి చెట్టతనంబుఁ జూపింతువా పాపీ! ఇఁకనైన బుద్ధి తెచ్చుకొని సత్ప్రివర్తనగలవాఁడవు కమ్ము.

కేశ—కాంతా! చదివినదేచదువుచు మదనోన్మాదంబున నొడ లెఱుఁగక కడుబడలియున్న నన్నేల యలసటఁ బెట్టెదవు? వినుము.

శా. పాంకంబైన త్వదీయదేహలత సంకే పూర్ణంబుగాసోఁక నన్
బంకేజాక్షి కటాక్షవీక్షణములంకే బాలింపు మింతేల మీా
నాంకుండారతినెన్ని యస్త్రైనిను నికే త్యంబేనుసేవింతు ని
శ్శంకన్ నమ్ము ప్రిగల్భమేఁబలుక వాకే స్తవ్యంబుగా నీయెడన్.

రేవ—ఓరికులపాంసనా! నీకెన్ని చెప్పినను బుద్ధిరాలేదా? ఆఁడు బిడ్డలుసూఁటుమన్న నీకుజయమగువా? ఒకసారికిఁ బదిసారులు తండ్రి

యని బ్రతిమాలుచుంటినే! నీకేలజాలికలుగకుండెను? ఈరీతి నబల
వేధించినవారెవరైనను బాగుపడిరా? దుర్మతీ! దూరము పరికించి
మూర్ఖ వాదము విడువుము.

కేశ—వన్నెలాడీ! నీ వెన్ని చెప్పినను నిన్నుఁబొందుటకు
త్రము వెనుదీయను. అట్లు వెనుదీయుటకు సామనం బొప్పదు. నన్ని
కష్ట పెట్టినంతమాత్రమున నీకు నేమిసౌఖ్యముగలుగును? శీఘ్రమే ప్ర
న్నహృదయవుగమ్ము. నీవెప్పుడు కటాక్షించెదవో యప్పుడే మన
రువుర మా రేవతీచంద్రులకన్న మిన్నఁగా సౌఖ్యపడెదము. తె
సినదా?

రేవ—తుచ్ఛా! నీవొకటికాదు. పది చెప్పు. నందచెప్పు
వేయిచెప్పు మెన్ని చెప్పినను, ఈరేవతి బొందిలోఁ బ్రాణములుం
వఱకు నిన్నాసింపదని గట్టిగా నమ్ముము.

కేశ—(కొంచెముకోపముతో గుడ్లురిమి చూచుచు) ఆ
ఏమీ! అట్లైన నీకుజీవితాశయే లేదా?

రేవ—లేదు. ముమ్మాటికిని లేదు.

కేశ—(స్వ) ఇంతమాత్రమునకే నేనుద్వరపడిన నేమిలా
భము? కొంచెమోర్చుకొని సామవచనంబులచే నెట్లేని వశీకృతన
గావించుకొనుటయే మంచిది. కాన నీవిధముగా మాట్లాడ నుపక్ర
మించెదఁగాక. (ప్ర) వామలోచనా! కామునినైనఁ గట్టివేయఁజాలు
నీసౌందర్యసంపద నేల నిష్కారణముగాఁ గోలుపోయెదవు? జీవించియు
న్నఁగదా యేసౌఖ్యమైన ననుభవించుట! అట్టిజీవితాశ నీకేలనశించినది?
నీకంతటికష్టమేమివచ్చినది?

రేవ—కనుగందులమగు మమ్ము విడనాడి మాతలిదండ్రులె
పుడు పరలోకగతులైరో యప్పుడే మాకీగతిపట్టినది.

కేశ—సుందరీ! గతజలసేతుబంధనమెందులకు? ప్రపంచము

నందున్నంతవఱకు నే(ప్రాణివైనను సౌఖ్యము నన్వేషింపవలయు నుగదా!

రేవ — అట్టిసౌఖ్యము ధర్మబద్ధముగా నున్నపుడు కాని, ధర్మదూరముగా నున్నపుడు కాదు. అదియునుంగాక జననంబాది దురంత చింతలలో మునింగి తేలుచున్న నాకేటిసౌఖ్యము?

కేశ — మత్తకాశిని! నీచిత్తము దుఃఖాయత్తమగుటం జేసితత్తఅపాటుతో నీవిట్టియుత్తరము లొసంగుచున్న దానవు; కాని కొంచెము నెమ్మదిగా విచారించిన నిందధర్మమేమియు. లేదని నీకేదృఢపడంగలదు.

రేవ — వాచాటా! ఇందధర్మమేమియు లేదా? ఇటువినుము.

మ. పరకాంతంగవియంగఁబోయికద! యా పౌలస్త్యుఁడాత్మీయరా
జ్యరమంబాయుటెకాక; బంధుహితభృత్యామాత్యపుత్రాళితో
ధరనిర్మూలము కాఁడె? రాఘవుపరి స్త్రాజిహ్మగశ్రేణి సం
గరరంగంబున మూఢ! యేటికిటు నీ గర్ధర్మదూరుండవై.

పాపీ! మదోన్మత్తుండవై యేల చెడిపోయెదవు? ఇంతటనైన బుద్ధి తెచ్చుకొనుము.

కేశ — ఇందుముఖి! మన్మందిరమునకు నందం బెసంగం జేయుచు నాయధీనములో నున్న నీవు పరకాంత వెట్లయితివి? నీకిదివఱకు వపులెవ్వరును లేరుకదా! అయినను నేనొకసంగతి నెఱింగింతువినుము.

తే. గీ. కౌశికుండలమేనకఁ గలియలేదె?
గోత్రవైరి యహల్యను గూడలేదె?
మాండకర్ణి యచ్చరలను మరగలేదె?
వారికేలోటుకలిగె ర వ్వంత చెపుమ.

కావునఁ బిల్లిశాపంబుల కెన్నఁడు నుట్లు తెగిపడవు. ఊరక వారి వీరి నెన్నదవేల? నాయభీష్టముం దీర్పుము. ఇందధర్మమేమియులేదు.

రేవ—చెడుగా! ఎందులకు లేదు? నీకన్నులకుఁ బూర్తిగా మద ముతట్టుటవలన నీకుఁ గనుపించుట లేదు.

కేశ—ఇందునదనా! ఎందులకుండును? మనమిరువురము స్త్రీపు రుషులముగామా ? లోకంబున స్త్రీపురుషులకు దాంపత్యధర్మము లేదా? ఏల యెఱుఁగనట్లు మాటలాడెదవు?

రేవ—ఛీ! కఠినహృదయా! మదాంధుండవగు నీకెన్ని చెప్పి నను బూడిదలోఁబోసిన పన్నీరుచందమయ్యెను. దుండగీఁడా! నన్నిట్టి కఠినభాషణముల నలసటఁబెట్టిన నీకేమిలాభము? అబలలమగు మా బోంట్లపై నించుక జాలివహింపుము.

కేశ—ఒయ్యారీ! నీనెయ్యముంగోరితిని. చయ్యన నియ్యకో నుము. తాలిమి వహింపఁజాల.

ఉత్సాహ.

పాపిమరుఁడు వాఁడిబాణ పంక్తి మీఁద గుప్పుచున్
దాపమొందఁ జేయుచుండెఁ దాళఁజాల నేనిఁకన్
బాపమనుచుఁ బుణ్యమనుచుఁ బడఁతి! చెప్పఁబోకు నీ
పాపుఁ గోరినాఁడ వేగ బాధమాన్పి ప్రోవవే!

రేవ—దుర్మతీ! నీపట్టిన పట్టును వీడకున్న దేనితోనైన నొక పెట్టుఁబెట్టి యాదిక్కులేని నిర్భాగ్యురాలను దుదముట్టింపుము. లేదా, దయామయుఁడవై నన్ను నదలిపెట్టుము.

కేశ—అన్నులమిన్నా! నిన్ను నదలిపెట్టనేల? చంపనేల? అవి రెండును నీవునాకుసాధ్యురాలవు కానపుడుకదా! నాకంతయవసర మేమికలిగినది? సామవచనంబులఁ జక్కఁబడుదువునా మంచిది. అట్లుకాకున్న నాకడ్డమెవరు! బలిమినైనను నిన్నుఁ గలియక విడువను.

రేవ—(దుఃఖముతో స్వగతము) ఓసూలదైవమా! నన్నీరాక్షసుని చేతిలోఁ జిక్కవైచి యింతగా నలయించుటకు నీమొక నేనేమి ద్రో

హామొనరించితిని? అకటకటా! అబలనగు నన్నీమాతృద్రోహి గాఢాంధకారసంయుతంబును నిర్జనంబును నగు నీప్రదేశంబున నొంటరిగాఁదన చేజిక్కించుకొని యేమిచేయనున్నాఁడోకదా! హా! దైవమా! దీనురాలనగు నాపై నీకైనను జాలికలుగలేదా? నీవేయిట్లుచూచుచు నూరకున్న నన్నింక రక్షించుశరణ్యులెవ్వరు? (అనుచు నేడ్చును.)

కాంచపదవృత్తము.

కేశ—చేడియ నీవీచెన్నున శోక

స్థితమతివనరుచుఁ గె జెడటదిమేలా

వేడుకతో ననుగూడుము లేదా

విడువనుదడయకు గె బిడియమదేలా

రేవ—(దుఃఖముతో.)

పాడిదొఱంగెక్ భావ్యమె? నీకీ

పగిదిని నిరతముఁ గె బ్రిణుతులు సల్పన్

ఆఁడుదియేడ్వంగన్ జయమే నీ

వరయవు మనమున గె నదయత నిట్టుల్

కేశ—వగలాడీ! నీదగుల్బాజీచేష్టలు నాకడఁబనికిరావు. రమ్ము రమ్ము. ఒక్కముద్దిమ్ము (అనుచుఁ బట్టుకొనఁబోవును.)

[తెరలో]

ఉ. ఎవ్వఁడవోరి! భీతహరి గె ణేషుల దొంగిలి తెచ్చి యిట్టులం
గొవ్వున సంచరించెదవు గె క్రూరతరంబగు మత్కృపాణితో
జివ్వనఁ జీల్తు నీవపుపుఁ గె జిల్లులుగా నిఁకఁ గాచికొమ్ము చీ
యెవ్వఁడు నిన్నుఁగావఁగలఁ గె డెవ్వనిఁజేరుదొ వేగ దుర్మతీ!

ఓరోరిదుర్మదాంధా! ఈమోహినిదేహంబున జీవంబులుండఁగనే యింక నీవిట్టికట్టిడిపనుల కొడిగట్టుచుంటివా? జాగ్రత్త! జాగ్రత్త!!

కేశ—(రేవతినంటక యేయులికిపడి నివ్వెఱపడిచూచుచు వె
కకు జరుగుచుండును.)

మోహిని—(పూర్వోక్తపద్యమునే చదువుచుఁ బ్రవేశించి
ఓరోరి...

కేశ—(తత్తఱపాటుతో లోపలనున్నదీపము నార్పి యొకమూ
లకొదుగును.)

రేవ—(మెల్లఁగాఁ దప్పించుకొని బయటికి వచ్చి నిష్క్ర
మించును.)

మోహి—(తలుపులు బిగించి గొళ్ళెమును దగిలించి నిష్క్ర
మించును.)

[తెర పడును.]

2 వ రంగము—కలకత్తానగరవీధి.

[రేవతి ప్రవేశించును.]

రేవ—(దుఃఖముతో స్వగతము.)

స్రగ్విణీవృత్తము.

ఏను మున్నెన్నఁడీ కె యిల్లెఱుంగం గటా!
ఈనిశీథంబునం కె దెట్లు పోవంగనౌ!
దీనులం బ్రోవఁగా కె దిక్కు నీవేకదా!
శ్రీనివాసా! కటా కె క్షించి రక్షింపుమా!

అకటకటా! మా నొసళ్ళ దైవ మెంత దురదృష్టపువ్రాఁత వ్రాసి
నాఁడు. ఇట్టివ్రాఁతతో నీనరజన్మము నెత్తింపకున్న నేనందినో, యేపం
దినో, చేసిన నెంతబాగుండును. అయ్యో! ఈనిశీథసమయంబున నీభీక
రమేఘగర్జనములలో నీగాఢాంధకారములో నొకసారి చూచియుండి
నను నెన్నఁగాననిఈమహానగరరాజమార్గంబుల గోసాయి యిల్లెక్క

ఉఁగలఁడని యరుగుదును? అయ్యో! విచారించుదమన్న నెవ్వరును గనఁబడుటలేదే! ఒక్కదీపమైనను గానఁబడదే! ఏమి చేతును? ఏది దిక్కు? (పాదము లొత్తుకొనుచు) అబ్బా! దారిగానక యీ గోడకు నా గోడకు తాతికి అప్పుడుఁ గొట్టుకొనుటచే శరీరాంగములెల్లను బచ్చిపుండ్లై యెటుపోదమన్నను పాదములు ముందునకు సాఁగకున్న విగదా! ఓపాడుదైవమా! ఎంతచేసితివి! ఓహో! నిష్కారణముగా విధి నిందితమేలచేయవలయును? నాపూర్వజన్మసంచితకర్మఫలంబే యిట్లు చేయుచున్నది. కట్టా!

సీ. చనుఁబాలుఁ గ్రోలుటఁ జాలించుటకుముందె
జననీవియోగంబు సంభవించె
నాటపాటలనైన నరసిమెచ్చకమున్నె
యయ్య మమ్ములవీడి యస్తమించె
నది యాదిగాఁగ భృత్యామాత్యమిత్రాది
పరివారమెల్లను భస్మమయ్యెఁ
దండ్రిపోయినఁ బిన తండ్రి దిక్కని నమ్మ
మాచావునకె పెట్టె? మమతవీడి

తే. గీ. అక్కటా! చెల్లెలధ్వాన్న మయ్యె; నాకు
నిట్టి నీచమౌ గతివట్టె; నెట్టులింక
జీవితాశ జనించు? నో దేవదేవ
నన్ను మావారిఁ జేర్పు పరి సన్నదృష్టి.

అయ్యో! ఎంతయేడ్చినను నాకు శరణ్యు లేరును లేరుగదా! (వినుటనభినయించి) అటనెవ్వరో మాటలాడుచున్నట్టులున్నది. వారినడిగిన గోసాయియింటిజాడ తెలియునేమో యడిగి తెలిసికొనియెద (కొంచెమునడచి) అయ్యా! గోసాయియిల్లెక్కడనో తెలిసినయెడలఁ గొంచెముచెప్పుదురా? (వినుటనభినయించి, ఏమనుచున్నారు? ఈవీధి చివరకు వెళ్ళఁ

గా నటఁగుడి వైపుననున్న చెఱువుగట్టున కానుకొనియున్న మొంటిఋల్ల
నియా? చిత్తము. (నిష్క్రమించును.)

3 వ రంగము—జీవనపాల్ తోఁట.

[గారిచంద్ ప్రవేశించును.]

గా—ఆకసము మేఘావృతమై దిశలెల్ల గాఢాంధకార
బంధురమై యెటుపోదమన్నను దారితెలియని ఈయర్ధరాత్రింబున
నీమాయలమారి కేశవుఁ డెందున్నవాఁడని వెదకుదును? ముఖ్యముగా
వెళ్ళివచ్చుచుండు నిలయములన్నియును రోసితిని. ఎక్కడనుగూడ
గొంచెము జాడ దొరకినదికాదు. ఇఁకెంతయని తిరుగుదును. తిరి
తిరిగి కాళ్ళులాగుకొని పోవుచున్నవి. అయిన నిక్కడఁగూడఁ జూచి
నాదారిని నేను బోయెదను. (ఇంటినిసమీపించి తలుపులుబిగించి
యుండుటనుజూచి) ఏమిది? తలుపులన్నియు బంధింపఁబడియున్నవే? కే
వుఁడిచ్చటనున్న యెడల నొకగవాక్షమైనఁ దెఱచియుంచఁడా! ఒకవే
లోపలఁ బరుండి యుండెననుకొందము. తలుపులన్నియు వెలుపల
బంధింపఁబడి యున్నవే! కారణమేమైయుండును? ఏమైననేమి నావల
లోపముగలుగకుండ నొకకేక వైచి వెళ్ళెదను (వాకిలిసమీపించి ప్రకా
శముగా) కేశవా! (స్వ) ఆఁ ఏమి! ఎవ్వరునుబలుకుటలేదే? యిందు
రేవతియేమయ్యెనో! ఆపెకూడఁ పలుకుటలేదే? ఇంకొకసారి పిలి
చూచెదఁగాక (ప్ర) కేశవా!

కేశ—ఆఁ. ఆఁ. ఎవరువారు?

గారి—తమరెవ్వరు?

కేశ—నేను కేశవచంద్ను.

గారి—నేను గారిచంద్ను.

కేశ—ఓహో! త్వరగావచ్చి మేలే కలిగించితివి.

గారి—త్వరగానేమి? మేలేమి?

కేశ—చెప్పెదను. ముందు తలుపుఁదీయుము.

గౌరి—తాళపుఁజెవి యెచ్చటనున్నది? మీదగ్గఱనున్నదా?

కేశ—లేదు. లేదు. ఏవిధముననైనఁ దఁటాలుపడి తీయవలయును?

గౌరి—(ఒకరాతితో గొళ్ళెమువిఱుగఁగొట్టి తలుపుఁదీయును.)

కేశ—(బయటికివచ్చును)

గౌరి—కేశవజీ! అంతయు వింతగానున్నది. ఏమిఁజరిగినది?

కేశ—ఏమిజరిగినదని చెప్పుదును. చేతిలోనిమణి జాఱిపోయినది. గట్టుకుఁజేరిననావ మునిఁగిపోయినది. ఇరువదివేలరూపాయలెత్తు బారమైనవి.

గౌరి—ఎందువలన? రేవతితప్పించుకొని పోయినదా యేమి?

కేశ—ఔను.

గౌరి—ఎట్లుతప్పించుకొనఁగలిగినది?

కేశ—మనమెట్లుపోవుచున్నను మనవెన్నంటి తిరుగుచున్న పిశాచి మోహినీసహాయమున.

గౌరి—మోహినియే యిట్లుచేసినదని మీరెట్లు తెలిసికొంటిరి?

కేశ.—తెలిసికొనుటయేమి? నాకన్నులయెదుటనే జరిగినది.

గౌరి—ఆఁ!ఏమి! మీయెదుటనే జరిగినదా?

కేశ—ఔను. చెప్పెదను వినుము.

ఉ. ఏనరవంద్యుఁ డిత్తునని యిర్వదివేలరూకలా
మానవనాథుఁడాత్రిపడి మాటికి లేఖల నంపుచుండ నేఁ
బూనిక రేవతింగని సుబోధ యొనర్పఁగ నెంచి రాఁగ నీ
లోనఁ దటస్థమయ్యె నొకలోపము నాయెడఁ గల్గ నిట్టులన్.

గౌరి—ఏమిలోపము జరిగినది?

కేశ—నేను గత్తినిగాని కఱ్ఱనుగాని చేతఁబట్టుకొని వెళ్ళక ని రాయుధుండనై సామవచనంబుల నొప్పుకొనునుగదాయని మెల్లగా నుద్బోధించుచుంటిని. ఇంతలో నాపిశాచి మోహిని యెటనుండివచ్చె నోకాని కత్తింజళిపించుచు నీగుమ్మముదగ్గఱకువచ్చి నిలిచినది. నాచేత నేమియు లేక నిరాయుధుఁడనై యుండుటచే నెదురొర్కొనిన జంపునే మో యనుభయంబున నొకమూలకొదిగికొంటిని. ఇదే యదనని చీఁక టింటిలో మెల్లఁగా వాకిటికిఁజేర రేవతిని వెలుపలికి లాగికొని మఃపి శాచి వెంటనే కవాటమును బంధించినది. ఇఁక నేమిచెప్పుదును. వారి దారి వారుచూచుకొనినారు. ఇదియేమియన్యాయమురా ఫలింపనున్న చెట్టును మొదఁటంట నఱకుకొంటినని విచారపడుచు నింతకుముందుగా నే కనుమూసినట్లున్నాను. ఇంతలో నీవుపిలిచితివి.

గౌరి—ఇన్ని నాళ్ళనుండి పడినశ్రమయంతయు వ్యర్థమేనా?

కేశ—వ్యర్థముగా కేమున్నది? ఈనఁగాచి నక్కలకుఁ బెట్టినట్లి న్నినాళ్ళు శ్రమపడిన దంతయు నీ పొట్టను బెట్టి పొట్టఁగప్పవలసి వ చ్చినది.

గౌరి—లోకువయెవ్వఁడన్న మంగలివాఁడే లోకువయన్నట్లు మీ రేదిచెప్పిన నెదురాడక చేయుచుంటిననియాం; ఇట్లన్నియు నామీఁ దనే రుద్దుట? ఇందు నేనేమి చేసితిని?

కేశ.—ఏమిచేసితినని వేఱే యడుగవలయునా? నీవు వెళ్ళినదె ప్పుడు? రావలసినదెప్పుడు? వచ్చినదెప్పుడు? సరియైనవేళకే వచ్చిన నింత నష్టమురాదుకదా!

గౌరి—దానికా? సరి! సరి! నేను మీయాజ్ఞానుసారము గంట ప్రొద్దుండగనే వచ్చి మీదర్శనమునకై యింతదనుక నేనెంత శ్రమపడితి నో భగవంతునికే యెఱుక.

కేశ—శ్రమపడవలసినంత యగత్యమేమి?

గౌరి—ఏమా' మొదట నేనిచ్చటికి వచ్చుసరికి మీరిచ్చట లే రు. ఇన్నాళ్ళు జమీలియా—కాదు-కాదు-అమ్మగారున్నపుడు మీ రెక్కడనున్నదియుఁ దెలియుచుండెడిది. ఇప్పుడామె లేకుండుటచేఁ ద మిజుద్దీను కడకరిగితి రేమోయని యక్కడకు వెళ్లితిని. అక్కడమీరెవ్వ రును గన్పింపలేదు. గుల్‌సుమ్ కన్పింపఁగా డాక్టరు ఫూల్‌సాహెబ్ ఇక్కడనున్నాఁడాయని యడిగితిని. ఫూల్‌సాహెబెవ్వఁడో మాలసాహె బెవ్వఁడో దేవునికే తెలియుననుచు రివ్వునఁ దలుపులు వేసికొని లోపలి కిఁ బోయినది. ఇదేమియు బాగుగాలేదురాయని తిరిగి యిచ్చో టికివచ్చుసరికీవేళయైనది. ఇందునాలోపమేమి?

కేశ—సరే! వెళ్ళినసంగతి యేమైనది? కాయా? పండా?

గౌరి—మొదటిదే యైనది.

కేశ—ఏమిసమాధానము చెప్పినాఁడు?

గౌరి—భవాజీకెట్లో నాకునట్లే.

కేశ.—సరే! ఆవిషయము పిమ్మట నాలోచింపవచ్చును. మ నమిరువురము బయలుదేఱ ప్రస్తుతము.

—♦ సుగంధివృత్తము. ♦—

ఆదినుండి యెట్టికార్యకైన మాచరింపఁ బూనినం
బాదునందు నుండు పుర్వు భంగి హానిఁ గొల్పుచున్
మీఁదమీఁద సంచరించు మిత్తిఁబోలు మోహినిన్
బూదిసేసి మీఁదికార్య మింక నందగుఁన్ సఖా!

మఱియు రేవతినిగూడ రోయవలయును.

గౌరి—చిత్తము. నేనెవ్వరికొఱకుఁ బోవలయును?

కేశ—రేవతికొఱకు వెళ్లుము. నేను మోహినికొఱకు వెళ్ళె దను. వెళ్లితిననినవెళ్ళుటకాదు. కార్యసాఫల్యము చేసికొని రావల యును.

గౌరి—నాశక్తివంచనలేక ప్రియత్నింతును. మఱినాకుసెలవా?
కేశ—మంచిది నేనుగూడవచ్చుచున్నాను.

(ఇరువురు నిష్క్రమింతురు).

(తెరపడును)

4 వ రంగము కలకత్తాలో గోసాయీలవీధి.

(గౌరిచంద్ ప్రవేశించును)

గౌ—అల్లుని కొలువుం గొలుచుటకన్న నఱగడియ ముక్కుమూసికొని మృతుఁడగుట మేలుగదా! అబ్బా! ఎంతకష్టము! నిన్న వేకువను బయలుదేఱుటమొదలింతవఱకొక్కగడియయైనను గాలొకచోటఁ బెట్టుకొనుటకు విశ్రాంతి చిక్కియుండలేదుకదా! ఆనాఁడు కాలూరాయి యొద్ద శుశ్రూష చేయునప్పుడైనను నాకింతకష్టముగాఁ దోఁపలేదు. ఇప్పుడో ఫలమల్పము బాధయధికము ఏదితలపెట్టిన నందుముందుగా నాతల కనుపించుచుండవలయును దినమునకొకటియా రెండా? ఎన్నిఁటినని సాధించుట.

సీ. ఏదివాణంబైన కే బూదిసేయఁ దలంప
నందుముందుగ నేనె కే యరుగవలయు
నేహత్యకైనను కే సాహసింపుఁడటన్న
నందుముందుగ నేనె కే యరుగవలయు
నేదోఁపిడికినైన కే నెత్తికోలానరింప
నందుముందుగ నేనె కే యరుగవలయు
నేచిక్కుపైకొన్న కే నెద జంకు నొందక
యందుముందుగ నేనె కే యరుగవలయు
తే. గీ. నింకఁ జీటికి మాటికి కే నీర్ష్యలేక
ద్యోతమైన మహావర్ష కే పాతమైన

వాతమైనఁ దమంబైన కే వల్లెయనుచుఁ
దిరుగుచుండఁగవలయు రే కే దిరిమ్మగిగతి.

చీ! చీ! ఈవృత్తిని వదలుకొని యింతటినుండి నాలుగిండ్లయొద్ద ముష్టి యెత్తుకొని జీవించినను జాలబాగుండును. ఇప్పుడే వదలుకొందమన్నఁ గష్టపడియార్జించిన యీనాలుగుకాసులు గూడరావు. కనుక దీని పర్యవసానమేమి తేలునో చూచి యప్పటిస్థితిగతులనుబట్టి నాయిచ్చవచ్చినరీతిని సంచరించెదను. తెల్లవారవచ్చినట్లున్నది. వేకువ మొద లిప్పటివఱకొక దానివెంటనొకటి విరామములేక కూయుచున్న యీకుక్కుటారావములకుఁ జెవులు మూఁతలుపడుచున్నవి. ఇఁక నాపనికి నేను బ్రయత్నించెద. (అనుచు రెండడుగులునడిచి) ఎటుపోయినదియుఁగొంచెము జాడ చెప్పుటకైన నెవ్వరును గనుపించుట లేదే? (అటునిటు పాఱఁజూచి) ఓహో! అట నెవ్వరో సంభాషించుచున్నటులున్నది. వారికేమైనఁ దెలియునేమో యడిగిచూచెద. (కొంచెముముందుకుపచ్చి) అయ్యా! ఇంతకుముందొకగడియలోపల నీమార్గంబున స్త్రీలెవ్వరేని వెళ్లియుండిరా? (వినుటనభినయించి) ఆ- ఏమనుచున్నారు! గోసాయీల యిండ్లవైపునకుఁ బరుగిడి పోయినదనియా? మంచిది.

(నిష్క్రమించును.)

(తెరపడును)

5వ రంగము. స్థలము పోలీసుస్టేషన్-(యోగీంద్రుఁడును, అరిందముఁడును బ్రవేశింతురు)

యో—ఏమండీ! బాబుగారూ! తమకేమైన భోగట్టాచిక్కినదా?

అరిం—అయ్యా! నేనిప్పుడు చెప్పుటకు వీలులేదు. ఇంతవఱకు నేఁదీసిన కూపీ నిజమో అబద్ధమో తెలియకున్నది. నాసంగతి నటుంచుఁడు. మీరేమో కొంచెము ప్రయత్నించినారఁటగా?

యో.—ఔను! ఉదయము 7 గంటలుకొట్టుటకుముందే పట్ట ణంబునగల యీ బాలగోపాలమీవిషయముననే విమర్శించుచుండిరను వదంతి కలిగినది. అంత నేనును నలుగురుభటులును బయలుదేఱి వె ళ్లిచూచితిమి. రక్తముచే దడియఁబడిన (బట్టలను జూపుచు) ఈ యాఁ డుదుస్తులును, ఒకకత్తియు, రెండు తలముండ్లును, బట్టలకొకమూల నీ చాకలిగుర్తును గనుపించినవి. ఇంతలో నెవ్వరో రాత్రి యొకయాఁడు దానిని, దానింజంపుటకే వెళ్ళుచున్నటుల నొకకత్తిని బూని పరుగిడు చున్న మగవానిని శాలంభట్టు తనయనుచరులతోఁ జూచెననుపల్కు లు మాచెవినిబడెను. అంత మేమాబాలంభట్టును ఆసమయమున వా నితోనున్న మఱినలుగురిని బిలిచి కైఫియ్యతు పుచ్చుకొంటిమి. వారి చ్చిన వాఙ్మూలములలో యదునాథగోసాయియెల్లెక్కడని యాచిన్న ది వారిసడిగినట్లు చెప్పుటచే నేనాగోసాయినిబిలిపించి యడిగితిని. అతఁ డు "నేనేమియు నెఱుఁగననియును, వేరువను మా యక్కగారియూరి నుండి వచ్చుచు నేనీవస్తువులనే చూచితిననియును జెప్పెను. అంతనాక తనిమీఁద నిదివఱకే యనుమానము గలిగియుండుటవలన వెంటనే యీగుర్తులున్న ప్రదేశమున కతనిని దీసికొని వెళ్ళితిని. రాత్రి వర్షానం తరంబున నీపని జరిగియుండుటచే నటనున్న యడుగులు స్పష్టముగాఁ గ న్పించుచుండెను. వానిని బరీక్షించి యందు గోసాయియడుగు లెక్కు వగానుండుటఁ దెలిసికొని యతని నడిగితిమి. వాఁడేమియు సమాధా నమును జెప్పలేదు. అప్పుడే వాని నరెస్టుచేయ సంసిద్ధుఁడనైతిని; గా ని యంతయు నిజము తేలదేమోయని మఱల శంకించి యీవస్తువుల ను మాత్రము పట్టించుకొని వచ్చితిని.

అరి.—మంచిపనిని జేసినారు గోసాయినేబంధించినయెడల మన ప్రయత్నమంతయు మంటిపాలుకావలసినదే.

యో.—అయ్యా! ఈచాకలిగుర్తును, ముండ్లను జక్కఁగా విమ ర్శించి చూచినారా? (చేతికిచ్చును)

అ—(తీసికొని తన జేబులోనున్న యొక చాకలిగుర్తును ముం డ్లనుదీసికొని యొకటితో నొకటి పోల్చుచు) ఏమండోయి! చూచినా రా? అవియు నివియు నొక్కరిచే జేయఁబడినవి. ఈచాకలిగుర్తులును నొక్కరిచే వేయఁబడినవే; సంశయము లేదు. ఇదంతయుఁ జూడఁగా నే మో యింద్రజాలముగా నున్నది.

యో—అయ్యా! ఈగుడ్డలును గత్తియును గూడఁ బరీక్షించి చూడుఁడు.

అ—(చూచి) బాబూ! ఇందొక్కటికూడ నాకు నిజముగఁ గనఁబడుట లేదు. ఈగుడ్డలన్నవో రక్తముచల్లినమాడ్కిఁ దడిసియున్న వి; కాని హత్యచేసినపుడు తడిసియుండినట్లు కనుపించుట లేదు. ఈకత్తి నిజూతమన్నను మొద్దుపాటి రక్తముచేఁ దడుపఁబడినటున్నది; కాని నఱికినకత్తిగాఁ గనుపించుట లేదు. కాఁబట్టి యిందేమియు నిజము గ్రహింప వీలుగాకున్నది.

యో—సరే! ఇంక మనమేమి చేయుదము?

అరిం—చేయవలసినపని చాలకలదు. ప్రస్తుతము నేను యదు నాధగోసాయివల్ల నింకేమైన భోగట్టా రాఁగలదేమో కృత్రిమవేషము ధవెరించి ళ్లెదను.

యో—చిత్తము. (ఇరువురు నిష్క్రమింతురు)

(తెరపడును)

6 వ రంగము—గోసాయియిల్లు.

(బ్రాహ్మణవేషముతో నరిందముఁడు ప్రవేశించును)

బ్రా—(ఇంటినలువైపులకు బరికించి) (స్వగతము) ఆహా! సరి మైనవేళ నే బయలు దేఱితిని వీరెవ్వరో తలుపులన్నియును గట్టిగాబిగిం చుకొని యేదియో గోప్యముగా మాటలాడుచున్నారు. ఈగుసగుసలు

నా కేమైన, దోడుపడకుండునా? ఏమి ప్రసంగించుచుండిరో నిశ్శబ్దము గా నీకిటికీసందులకుఁ జెవిఁజేర్చి యాలకించెదను. (కొంచెముసే పట్లు వటించి రివ్వున బయటికివచ్చి) ఇఁక నేనిక్కడ నుండరాదు. వెలుపలికి రాఁగానే వీనిని వెంబడించి తగిన ప్రాయశ్చిత్తముఁ జేయవలయును. అంతదనుక నీగోడప్రక్క కొదిగికొనియెదను. (చాటుపడును).

గారి—(తటాలునఁ దలపుఁ దెఱచుకొని ప్రవేశించి పోవు చుండును)

బ్రా—(వెంటనే బయటికివచ్చి కొంతదూరము గారిచందును వెన్నంటిపోయి) అయ్యా! మీ రెవ్వరో నాకంతగాఁబరిచయము లేదు; కాని మీముఖమునుమాత్రము నేనెక్కడనో చూచినట్టులున్నది. మీ ముఖవర్చస్సు మీశాంతదృష్టి, మీసాత్వికరూపము—ఏమోలెండి! యీకాలములో నెంతమంచిగా మాట్లాడుదమన్నను చెడు వెంటనే వచ్చుచున్నది. మీవిషయమై నేను నిజమునే వర్ణించుచున్నను మీ రేదో పొగడిక యనుకొందురు. ఏమోలెండి మీదయ.

గారి—(బ్రాహ్మణునిమాటల కడ్డువచ్చి) అబ్బీ! నీదేయూరు? నీవర్ణమేమి?

బ్రా—(ఎదుటికివచ్చి) అయ్యా! నాయూరిసంగతి కేమిలెండి? అది చాలదూరమునఁ గలదు. ఇఁక నేను బ్రాహ్మణుఁడను. బీదవాఁడను. పిల్లవాని కుపనయము నిమిత్తమేదో సంచారముసేయుచున్నాను. మీరుచాలపెద్దవా—చాలగొప్ప—ఆఁ—ఆఁ—ఆఁ—

గారి—ఏమట్లు నొక్కిపట్టెదవు? నీకేమియు భయములేదు. చెప్పవలసిన దేదియో త్వరగా స్ఫుటముగాఁ జెప్పుము. పెద్దయేమి? గొప్పయేమి? సముద్రమా? ఆకసమా!

బ్రా—కాదండిబాబు! తమవలెనే తెలిసినవారియెదుట నేది మాట్లాడుచున్నను స్తుతిపాఠంబులఁ బొట్టఁబోసికొను బట్టువానివలెఁ

గన్పట్టునును. ఆ కారణమువలన నేనేదియు మాటలాడుటకు వీలులేక పెదవిదాఁటి వచ్చినవానిని లోపలికిఁ గుక్కుకొనుచున్నాను. శృంగారపురుషులు మహాదాతలు తమరెక్కడ నున్న నేమండి—ఉ॥ రాజులు కాంతియందు, రతిరాజులు రూపమునందు.

గౌరి—ఏమోయి! నీకుఁజాదస్తమా? లేక యింతరాత్రివేళ గాలియేమైన సోఁకి యట్లుపల్కించుచున్నదా?

బ్రాం—పిచ్చిగాని, దయ్యముపట్టుటగాని యెన్నఁడునులేదు. మీబోఁటి టాటోటులను, మాటకారులను, మోటుఁపండ్రిను మాత్రమప్పుడప్పుడు దయ్యముపట్టినట్లుపట్టుదును.

గౌరి—ఓరీ! ఏమోనీమాటలు నాకర్థమగుటలేదు.

బ్రాం—ఔను! మీకెట్లర్థమగును? ఇంతింతపనులు చేయు దుర్మార్గుల కింతమాత్రమున నర్థ మగునా?

గౌరి—నే నేమి చేసితిని?

బ్రాం—ఏమి చేసితివా, రాత్రి కూనీ చేసినది నీవు కాదా యేమి?

గౌరి—అయ్యా! కూనీ యేమో నాకు బొత్తుగాఁ దెలియదు. నాదీ యూరు కాదు. ఊరునకు నేను గ్రొత్త; నా కీ యూరు క్రొత్త. మీ రెవరు బాబూ! పోలీసువారా?

బ్రాం—కానిచో ని న్నేల వెంబడింతురు?

గౌరి—అయ్యా! మీ పాదములసాక్షి నాకేమియుఁ దెలియదండి.

బ్రాం—తెలియదనకుము. రాత్రి బాలంభట్టుతో మాట్లాడినది నీవా? యింకొకరా?

గౌరి—నేను గాదండి బాబు! అసలు బాలంభట్టునే మెఱుగను.

బ్రా—అసత్యమాడకుము. అతఁ డెప్పుడు ననృత మాడి యెఱుఁగఁడు.

గారి—నా పేరు చెప్పెనా?

బ్రా—లేదులేదు. నీ యవయవవైఖరు లన్నియుఁ జెప్పి నాఁడు. వానినిబట్టి పోల్చి చూడఁగా నా మహానీయుఁడవు నీవే యైనావు.

గారి—అయ్యా! మీరు కోపోద్రిక్తులైన నేను మాటలాడ లేను "నీళ్ళు పల్లమెఱుఁగు; నిజము దేవుఁ డెఱుంగు" నన్నట్లు, ఇదం తయు నేమో దైవమునకే యెఱుక. నేను మాత్రి మీవిషయమున నేమియు నెఱుంగను. సెలవిండు.

బ్రా—నీకుఁ దెలియనే తెలియదా?

గారి—నాకుఁ దెలియదండి బాబు! ప్రొద్దు పోవుచున్నది సెలవిండు.

బ్రా—సరియే వెళ్ళుము.

గారి—చిత్తము (వెనుకకుఁ జూడకుండ వడివడిగాఁ బోవు చుండును.)

బ్రా—(మఱల వెంబడించి పోవుచున్నగారిచందును బట్టి రెండుచేతులను నొక్కి పట్టుకొని కాళ్ళతో మోకాళ్ళవెనుకఁ బొడిచి వానియొద్ద నున్నకత్తిని గోసాయియిచ్చినయుత్తరమును లాగికొని క్రిందఁ బడవైచి బొమ్మమీఁదఁ గూరుచుండును.)

గారి—అయ్యా! రక్షింపుఁడు. రక్షింపుఁడు. నే నెవ్వరికిని గీడు చేయువాఁడను గాను. లేచి నా కత్తిని నా కిండు.

బ్రా—అరే! చూఫాప్! కత్తి లేదు. నీ నెత్తి లేదు. పొమ్ము. నీ గోసాయియింటికి నీవు పొమ్ము. (వానిమీఁదినుండి లేచి నిష్క్రమించును.)

గౌరి—(మెల్లఁగా లేచి యొడలిదుమ్ము దులుపుకొని) మా యోపాయంబున నన్ను వంచనచేసిన వీఁ డెవ్వఁడో తెలియకున్నది. కానిమ్ము వీనిజాడ దొరకిననాఁడే నా కోరిక నీడేర్చుకొనెదఁగాక.

(నిష్క్రమించును.)

[తెర పడును.]

7 వ రంగము—యదునాథగోస్వామియిల్లు.

[యదునాథుఁడును, రేవతియుఁ బ్రవేశింతురు.]

యదు—అమ్మా! నానాఁటికిఁ గృశించిపోవుచు దుర్భరవిచార గ్రస్తవుగాఁ గనుపించుచున్నావు. నీ మనంబునందలి నాఁటి భయ మింకను నశింపలేదా?

రేవ—తండ్రీ! తమ పజ్జ నున్నంతకాలము నాకే భయమును లేదు.

యదు—అమ్మా! ఒక్కమాట చెప్పెదను వినుము

ఉ. నీపిత యెట్లొ యట్లె నను నీ సుఖములు నీసుఖములుగాఁ దలంచి సం
తాపము నించుకేనియు మనంబున నొందక ధైర్య మూని యి
చ్ఛాపరత న్మెలంగుము భృశంబుగఁ బ్రేమను జూపి ఏమిటన్
లోపము గల్గనీక త్వరలో శుభ మొందఁగఁ జేతు నాత్మజా!

రేవ—తండ్రీ! నన్ను నీళ్ళముంచినను బాలముంచినను నీయ దియే భారము.

[ముసలిబ్రాహ్మణుఁడు ప్రవేశించును.]

ము—అయ్యా! అ—అయ్యా (చేసన్నతో) దాహ—ము— దా—హ—ము (జందెమును జూపుచు) బ్రాహ్—మ—ణుఁ— డను,—బ్రాహ్—మ—ణుఁ—డను—(కూరుచుండును.)

యదు—అమ్మా! లోని కేగి త్వరగా మజ్జిగఁ దెమ్ము.

రేవ—చిత్తము (వెంటనే లోని కేగి చల్ల తెచ్చును.)

య—అమ్మా! చావసిద్ధముగానున్నాఁడు; త్వరగా నిమ్ము.

రేవ—తాతా! ఇదిగో! (ముసలిబ్రాహ్మణుని కిచ్చును.)

ము—(తీసికొని త్వరత్వరగాఁ దాగి) తల్లీ! నీ కడుపు చల్లఁగా వేయేండ్లు బ్రదుకుము. (యదునాధునివంకఁ జూచి) అయ్యా! మీ దయవలనఁ జావసిద్ధముగానున్నవాఁడను బ్రదికినాను. మీ యపారకృపావిశేషమును వేనోళ్ళఁ గీర్తించుకొనుచు బ్రతికెదను. (కొంచెము సే పూరకుండి) ఇదేమండి బాబూ! అయ్యో! అయ్యో! భూమియంతయుఁ జక్రములాగునఁ దిరుగుచున్నది. శిరస్సు కంప మెత్తుచున్నది. కన్నులు--మూఁతలు-- పడుచున్నవి--మా--ట--కూ--డ--తడఁ--బడుచున్న—దే—అయ్యో!—అ—య్యో!—(పడిపోవును.)

రేవ—తండ్రీ! ఏమితఁ డిట్లు పడిపోవుటకుఁ గారణము?

య—అమ్మా! ఈ వేసఁగికాలములో రెండుజాముల వేళ నీముదుసలి ప్రయాణముచేయుటచే మిటమిట మాఁడ్చుచున్న యీయాతపంబునకు శరీర మెల్ల నధికోష్ణముం బొంది మనమిచ్చినమజ్జిగఁ బుచ్చుకొనుటతోడనే శైత్యమునకు మఱలి యీ స్థితిఁ గలుగఁజేసినది. ఆలసించిన నపాయ మగునే మో? నేను వైద్యునిం బిలిచికొనివచ్చెద. నీవీ లోపల వీనికిఁ బరిచర్యలుసేయుచుండుము (నిష్క్రమించును.)

రేవ—చిత్తము (ముసలివానికి వీవనతో విసరుచుండును.)

ము—(కొంచెము సేదదేఱినటుల నటియించి) చెల్లెలా! యదునాధుఁడు నీ కేమి కావలయును?

రేవ—తండ్రి కావలయును.

ము—కావలయు ననుచుంటివి. కన్నతండ్రి కాఁడా యేమి?

రేవ—(కొంచెము భయము గలిగినమనస్సుతో విసరుట మాని ఊచ్చపడి యుండును.)

ము—అమ్మా! నీవు భయపడవద్దు. నీకు నేను విరోధిని గాను. నీ మేలుకొఱకే వచ్చితిని. నీ స్థితిగతులు నా యొద్ద నేమియు దాఁపక చెప్పుము, నీ కింకొకయాపద రానున్నది. నీ వా యాపద పాలైతివా, యందుండి తప్పించుకొనలేవు.

రేవ—(స్వ) ఏమిది! ఈయన యెవ్వరో జ్యోతిష్కునివలె నున్నాఁడే. ఇదివఱకు నాకు వచ్చినయాపదను గుఱించియు రానున్న యాపదను గుఱించియు తాయి గుర్తిద్దినటులఁ జెప్పుచున్నాఁడే. ఈయనయొద్ద నేదియో పరిభావము గలదు. అయిన నిట్లు మాట్లాడెదగాక (ప్ర) అయ్యా! నా కిదివఱకే యాపద వచ్చినది? ఇంకే యాపద రానున్నది? ఏదియును లేదే.

ము—చెల్లెలా!

కం. వచ్చినయాపద పూసం
గుచ్చినయటు చెప్పఁగలను కోమలి! నీతో
నిచ్చకము లాడుతలఁపున
వచ్చితినా? మేలుఁ గూర్ప వచ్చితి నీకున్.

పోనీ! గౌరిచందు నెఱుఁగుదువా?

రేవ—(భయకంపితహృదయయై మాట లాడకుండును.)

ము—అమ్మా! చెప్ప వేమి? నీవు నా మాటలను విశ్వసించి నిజము చెప్పనియెడలఁ ద్వరలోఁ జెడిపోదువు. సంశయింపక చెప్పుము. గౌరిచందు నెఱుఁగుదువా?

రేవ—(వణఁకుచు డగ్గుత్తికతో) అయ్యా! ఎఱుఁగుదును.

ము—కేశవచంద్రునో?

రేవ—(మిక్కిలి భయముతో) ఆఁ-ఎఱుఁగుదును.

ము—అట్లయిన వినుము.

శా. ఈ వేసంబును దాల్చి నే నిటకు వస్త్రీ నిన్ను రక్షింపఁగా
భావంబందున నెంచి వచ్చితిని సంభావ్యంబుగా నీ స్థితి

న్నానంతైనను దాఁప కే తెలిపి య కే త్యామోదముం బొంను
కీ వేళ శుభ మెల్లఁ గూర్తు నటుకా కే ద్దే జేటు వాటిల్లెదుర.
కనుక నా మాటలు పాటించి తగిన సమాధాన మిమ్ము. లేదా చెడి
పోయెదవు. నిన్నఁటిరేయి మొదటిజామున గౌరికి ని యదునాధుని
కిని జరిగినసంభాషణలో మఱల నిన్నుఁ గేశవచందు పాలుచేయుటకై
తలపెట్టుకొనినారు. ఇదిగో నీ యుత్తరమును జూడుము. నీకుఁ జదు
వు వచ్చునా?

రేవ—ఆ. కొంచెము వచ్చును.

ము—అయినచో ఇదిగో (ఉత్తరమిచ్చును.)

రేవ—(తీసికొని చదువును.)

రాజా కేశవచందు బాబుగారికి—

మన మిరువురమును ముఖాముఖి నొకరినొకరము దర్శించి
యుండలేదు; కాని తమప్రజ్ఞావిశేషము లన్నియును గౌరిచందువలనఁ
దెలిసికొనియున్నాను. ఈ రేవతి నెవరికో యిచ్చెద నన్న సమ్మతింప
లేదనియు నందువలననే యిన్నిదినంబులనుండియు బందీకృతను జేసితి
రనియు నెవరి సాహాయ్యముననో తప్పించుకొని వచ్చినదనియు నీ రేవ
తి మాయింటఁ బ్రవేశించిననాఁడే గౌరిచందు వల్ల నాకుఁ దెల్లమైనది.
మీావిషయమై రేవతి నా కెన్నియో చెప్పినది; కాని వానినెల్ల నేను
విశ్వసింపలేదు. నాకును మీా ప్రయత్నముకుఁ గొంత తోడుపడవ
లయు ననునభిలాష మెండుగాఁ గలదు, ఇప్పుడు రేవతి నా యాతా
లోనే యున్నది. నా కిప్పుడొక యవసరము వచ్చినది. దానికై ప్రి
స్తుత మొకవేయిరూపాయలు కావలయును. నాకు మీాయందు నమ్మ
కము లేమిచే నిట్లు వ్రాయుచుంటి నని తలంపక యీా మొత్తమును
గౌరిచందున కిచ్చి పంపవలయును. నేనును గౌరివెంటనే రేవతి
నంపెదను.

చిత్తగింపవలయును.

ఇట్లు,

మీ యాశ్రితుఁడు.

యదునాథశర్మవ్రాలు.

ము—అమ్మా! ఇప్పుడైనను నా పలుకులు నిజమని గ్రహించితివా? లేక యింకను సంశయమా?

రేవ—అయ్యా! ఇది నిశ్చయముగా యదునాథుఁడు వ్రాసినదే, సంశయ మేమియు లేదు. (యదునాథు నుద్దేశించి) ఓరి ద్రోహీ! మా యుప్పు పులుసుతోఁ జిన్ననాఁటినుండియుఁ జీవనము సేయుచునే నొకసాధువునని చెప్పుకొనుచు నమ్మి చెంతఁజేరినవారి నిట్లు గొంతులు గోయుచుంటివా? పాపీ! నీకింక సాధు వనుపే రేటికిరా? (మునలివానితో) అయ్యా! మీ కీ యుత్తర మెట్లు లభించినది?

ము—రాత్రి యదునాథునియొద్ద నీ యుత్తరమును వ్రాయించుకొని వెళ్ళుచున్న గారని నేను వెంబడించి యొక కత్తియు, నీ యుత్తరమును లాగి కొంటిని.

రేవ—అయ్యా! ఈ యాపన్నురాలిపై నింత దయాభావము నహించి యింత శ్రమ పడుచుంటిరి. తమ రెవరు?

ము—అమ్మా! నేనెవడ నైన నేమి? నీ దీనచరిత్రను దెలిసికొని రక్షింప సమకట్టితిని. ని న్నలయించువారిని శిక్షింపఁబూనుకొంటిని.

రేవ—అట్లులైనఁ జేఁజిక్కినగారి నేల విడిచితిరి?

ము—విడువక యేమి చేయవలయును?

రేవ—పట్టుకొనినయెడల మఱికొంత నిజము తేలఁగలదు కదా!

ము—అమ్మా!

తే. గీ. వాని నా క్షణమునఁ బట్టి వచ్చుఁగాని
వానిఁబోలిన ఖలు లింక వేనవేలు
కలరు వారల చర్యలు దెలియు వఱకుఁ
బట్టరాదని వదలితిఁ బట్టెఁ నిజము.

ఇంతియే కాక వారలంగూర్చి నేఁ దీయుచున్న కూపీ లనేకంబులు గలవు. వీని నింతమాత్రమున నే కారాగారబద్ధునిగాఁ జేసిన యెడల నింత వఱకు నేఁ బడినశ్రమ యంతయు వ్యర్థము కాఁగలదు. నా యొద్ద నీ వేమియు గుప్తపఱచక నీ నిజస్థితి యంతయుఁ జెప్పుము. నిన్నుఁ దప్పక రక్షింతును.

రేవ—అయ్యా! నా పేరీయుత్తరములో నున్నది కదా? ఇక నా తండ్రిపేరు జానకీనాథబోసు.

ము—ఓహో? జమీందారుగారా?

రేవ—చిత్తము. జమీందారని మీ కెట్లు తెలియును?

ము—ఆయన తమ్ముఁడేదో అన్నగారిపై దావా వేసి దినమున కిరువదిసారు లిక్కడికి కక్కడికిఁ దిరుగుచుండెడివాఁడు. ఆయన పేరు గూడ నే నెఱుఁగుదును (స్మరణకు దెచ్చుకొనఁబోవును.)

రేవ—గోపాల్ చందు.

ము—ఔ నౌను. అదియే నోటిలో నాడుచున్నది.

రేవ—అయ్యా! ఆయనగారియొద్దనే నే మింతవఱకును బెరిగినది.

ము—అదేమి? తలిదండ్రులు సజీవులు గారా యేమి?

రేవ—(దుఃఖముతో) తండ్రీ?

తే. గీ. పిన్న పెద్దల నెఱుఁగని చిన్ననాఁడె
కన్నతలిదండ్రు లిరువురు గాలధర్మ
మొంద (ఏడ్చును)

ము—అమ్మా! దుఃఖమున కిది యదను గాదు. చెప్పవలసి నవన్నియుఁ ద్వరగాఁ జెప్పుము.

రేవ—...నన్ను నా చెల్లెలి కె నుల్ల మలరఁ

ప్రేమతోఁ బెంచుచుండె మా పిన్నతండ్రి.

ము—అమ్మా! అతఁ డంత ప్రేమతోఁ బెంచుచుండినయెడల నీ కీ గతి యెట్లు పట్టినది?

రేవ—అయ్యా! మా పినతండ్రికిని మీ రిప్పుడు ప్రశ్నించిన కేశవచంద్రునకును నా చిన్ననాఁటినుండియు మిక్కిలి నేస్తము గలదు. ఆ మహాపాతకికి మా పినబాబున కేదేని దుర్బోధ యొనరించెనో, లేక ఆయనకే యీ బుద్ధి పుట్టినదో నాకు నిర్ధారణగాఁ దెలియదు. ఒక నాఁటిరాత్రి నా చెల్లెలు రోహిణియు నేను నొకచోటనే పరుంటిమి. తెల్లవాఱఁగనే లేచి చూతునుగదా నా పక్కలో నున్న రోహిణి లేదు. ఎక్కడ వెదకినను జాడ దొరకలేదు. అంతట నేను "అయ్యో! భగవంతుఁడా! ఇ దేటి యన్యాయము? తల్లిదండ్రులు లేకున్నను మమ్మునైనను సుఖముగాఁ బదికాలములపాటు బ్రతుకనిచ్చుట కిష్టము లేదా?" యని కంటికిఁ గడవెడు నీళ్లుగా నేడ్చుచు రెండవరాత్రి నిదురపట్టకున్నను నొంటిగాఁ బరుండియుంటిని. మంచి నిశీథసమయంబున నా దుర్మార్గుఁడు కేశవచందు నేఁ బరుండియున్నగదిలోనికి వచ్చి (దుఃఖించును.)

ము—అమ్మా! ఇది సమయము గా దూరడిల్లుము.

రేవ—అయ్యా! ఏమి చెప్పుదును?

చం. కరచరణంబులం బిగియఁ గట్టి స్పృశింపఁగరానితాళ్లట ని
న్నావలపడియుండి తోఁప కటఁ బెల్లుగ రోదన మాచరింప దు
ష్కర మిది యంచు నెంచకని శాచరుమాడ్కిని నిర్దయాత్ముఁడై
బిలబిల నోట వస్త్రములఁ బెట్టి యదల్చె నిఁకేమిచేయుదున్.

అంత నన్నుఁ దీసికొనివచ్చి ప్రేతభూమి నానొప్పా. నొక శిథిలగృహ మునం దుంచెను.

ము—నీ వెట్లు తప్పించుకొనఁగలిగితివి ?

రేవ—చెప్పెద నాకర్ణింపుఁడు. ఆదుర్మార్గుఁడు నన్నుఁ దీసి కొనివచ్చిననాఁటినుండియుఁ దన్నుఁ బెండ్లి యాడుమనియు లేకున్నఁ జంపుదు ననియు బెదరించుచుండెను. చావున కైనను దెగించితిని; కాని వాని వివాహ మాడ నొప్పుకొనలేదు. ఇట్లే యతఁ డొకనాఁడు నన్ను బెదరించుచుండ నతఁడు త్యజించినకాంత యొక తె యొకక త్తిని జేఁబూని వీరావేశముతో—

ఉ. ఎవ్వఁడవోరి భీతహరి ! జేకుల దొంగిలి తెచ్చి యిట్టులం
గొవ్వున సంచరించెదవు ! క్రూరతరం బగుమత్కృపాణితోఁ
జివ్వునఁ జీల్తు నీవపువుఁ ! జిల్లులుగా నిఁకఁ గాచి కొమ్ము నీ
వెవ్వఁడు నిన్నుఁ గావఁగలఁ ! డేమి యొనర్తువో వేగ దుర్మతీ!

అనుచు జెప్పున నటకు వచ్చినది. అంత నా హంతకుఁడు నిరాయుధుఁ డుగా నుంటచే నందున్న దీపము నార్పి మెల్లగా నేమూలనో నక్కెను. నేనును సందుదొరకినది కదా యని బయటికి రా నామె వెంటనే యా యింటితలుపు లన్నియును బంధించి నా దీనచరిత్ర మంతయుఁ దెలిసి కొని యా యదునాథు నింటికి వచ్చుమార్గముఁ దెలిపినది. నే నంత రాత్రివేళ నానం తేనియు సంశయింపక పఱతెంచి యీ సమీపమున నున్న యొకయంగడివానివలన నీ యదునాథునింటిని దెలిసికొని యి చ్చటికి వచ్చి చేరితిని.

ము—చేరుటతోడనే యా గోసాయి నిన్ను సన్మానించెనా ?

రేవ—సన్మానింపకేమి ? నన్నుఁ జూచుటతోడనే యంతరా త్రివేళ జడిసికొంటి నని గాఁబోలు. మిక్కిలి గారాబముతో నొక కోడిని దెచ్చి దానిని నాకు దిగఁదుడిచి యదివఱకు నాయొంటినున్న

దుస్తులన్నియుఁ దీసివేయించి వానిపై నీ కోడిరక్తమంతయుఁ జల్లి వా నిని, ఒకకత్తిని, నాతలలో నున్నరెండుముండ్లను దీసికొనివెళ్లి యెట నో పాఱవైచి వచ్చి మఱల నా కింత విభూతి మంత్రించి నుదుటఁ బెట్టి నాయోగక్షేమములఁ దెలిసికొనుచు నింతింత యనరాని ప్రేమ ను జూపెను.

ము—ఈ లోపల గోసాయి నెవ్వరేనిఁ బిలిచిరా ?

రేవ—(స్మరణకుఁ దెచ్చుకొని) ఆ. ఎవ్వరో పిలిచిరి. పిలుచు టతోడనే వెళ్లి యేమి మాటలాడెనో కాని వెంటనే పదినిముసముల లోపలనే తిరిగి వచ్చినాఁడు.

ము—(స్వగతము) ఓహో ! నే ననుకొనినట్లే గుడ్డలు రక్త ముచేఁ దడుపఁబడినవనియుఁ దనవెనుక నెవరో వచ్చి గోసాయిని బిలి చెననియుఁ జెప్పినది. పాపము యోగిందుఁడింతమాత్రము గూడఁ గనిపెట్టలేఁడు. వట్టియమాయకుఁడు. (ప్ర) అవ్వా ! నీవు చెప్పిన దం తయు నిజమే. ఇఁక నీ విక్కడ నున్నచో మఱల యమకింకరులకుఁ జిక్కెదువు. నీవు మాయింటికిఁ జేరుటెట్లు ?

రేవ—తండ్రీ ! ఎట్లో మీరే సమర్థింపవలయును.

ము—అటులైన వినుము. మా పెత్తకభటునికొకనికి ముసల మ్మవేషము వేసి యతనివెంట నొక పల్లకి యిచ్చుటి కంపెదను. ఆము సలమ్మవేషధారి యీ గుమ్మముదగ్గఱకు వచ్చి "మా రేవతి యున్న దా ?" యని యడుగును. నీవు వెంటనే అవ్వా ! అవ్వా ! యని యే డ్చుచు వానిదగ్గఱకు రమ్ము. వెంటనే వి న్నాపల్లకిలో నెక్కించు కొని మా యింటఁ జేర్చెదరు. తరువాత జరుగవలసినవిధాన మాలో చించుకొందము. గోసాయి యగుయదునాథుఁడు వచ్చువేళ యైనది. ఇఁక నే నరిగెద—

రేవ—చిత్తము.

ము—(వెళ్లుటకు బయటివాకిలిఁ జేరును యదునాథుఁడు వైద్యునితో నెదుర్కొనును)

య— వెళ్లుచున్నారేమండి ?

ము—అయ్యా ! మీ దయవల్లఁ గొంచెము బాధ తగ్గినది. ఇఁక వెళ్లెదనులెండి !

య—ఈ యెండలో నెంత శ్రమ పెట్టితివయ్యా !

ము—అయ్యా! కరుణామయులు, దాతృత్వసంపన్నులు, పరోపకారులు నగుమీకీ శ్రమ యొకశ్రమ కాదు (నిష్క్రమించును)

(యదునాథుఁడు వైద్యునితో లోనికేగును)

ద్వితీయాంకము.





శ్రీ

# అరిందమ విజయము.

## తృతీయాంకము.

1 వ రంగము:—యోగీంద్రనాథుని యిల్లు.

(యోగీంద్రనాథుఁడు పరుండియుండును. చుట్టును మఱియొకసబిన స్పెక్టరును, ఇరువురు రక్షకభటులును మఱికొందఱు పౌరులును నుందురు.)

అరిం—(ప్రవేశించి) ఉచ్ఛ్వాసనిశ్శ్వాసము లేమైన నున్నవా?

స-ఇ—లేవు! లేవు! ప్రాణ మే మూలనో చిక్కుకొని యున్నది. శరీర మత్యుష్ణముగా నున్నది.

అరిం—వైద్యునికొఱకుఁ గబురంపితిరా?

స-ఇ—పంపి చాలసే పైనది (తిరిగి చూచి) వారుగో! వచ్చుచున్నారు.

(డాక్టరు ఫూల్‌సాహేబు ప్రవేశించును)

అరిం—(వచ్చెడివాని నెదుర్కొని) అయ్యా! మీ పేరేమో? కొంచెము శ్రద్ధతోఁ జూచి తగినయౌషధము వాడండి! మీ రేది కావలయు ననిన నది యిప్పింతును.

ఫూల్—చిత్తము (యోగీంద్రుని జేరి నాడిని బట్టి చూచి) బాబూ! నా చేతికి మించిపోయినది. నే నిప్పుడు చేయవలసిన దేదియు

ను లేదు. ఏమి చేయుటకును నాకుఁ దోఁచుట లేదు. ఏమో? ఆయన గారిభార్య దీర్ఘసుమంగలి యైన జీవించును. లేదేని మరణించును.

అరిం—ఇప్పు డేమిచేయుటకును వీలు లేదా?

ఫూల్—లేదు. లేదు. కొంచె మవకాశమే యున్నయెడల నే నేలమానుదును? నాకు దీనివలననే కదా! జీవనము.

అరిం—అయ్యో! ఇది అకస్మాత్తుగా సంభవించినదే! దేనివలన నో యూహించితిరా?

ఫూల్—కార్జములో జబ్బు ప్రబలి యిట్లు చేసినది. నాకు సెలవిప్పింపుఁడు.

అరిం—మంచిది వెళ్లుఁడు.

(ఫూల్ సాహేబు నిష్క్రమించును.)

ర_భ—(ప్రవేశించి) అరిందమబాబుగారూ! ఈ కాగితము ను జూడండి.

అరిం—ఎక్కడినుండి వచ్చినది?

ర_భ—యోగీంద్రనాధబాబుగారి పడకటింటిలో నున్నది. దీనినిఁజూచి మీ యింటియొద్దకుఁ దీసికొనిరాఁగా మీరచట లేరు. తరువాత నిచ్చటికే వచ్చితి రని తెలిసి తిరిగి వచ్చితిని. (కాగితమిచ్చును)

అరిం—(తీసికొని చదువును)

"అరిందమబాబూ!"

కేశవచందే ఫూల్ సాహేబువేషముతో డాక్టరు నని తిరుగు చున్నాఁడు. వీఁడెట్టికూ్రరకర్మము లైనను నిర్భయముగాఁ జేయఁ గలఁడు. వాని నెట్లయినను మీరు కనిపట్టవలయును. ఆ చిన్నదాని జంపినవాఁడు వాఁడే. విషమయమైనచుట్టను నా కిచ్చి నా కొంప దీసినది వాఁడే. తమ రశ్రద్ధగా నున్నారా, మిమ్ముననుగూడఁ జంపఁ గలఁడు జాగ్రత్తపడుఁడు—

బాబూ యోగీంద్రనాథుని వ్రాలు"

(ముక్కుమీఁద వ్రేలు పెట్టుకొని యాశ్చర్యముతో) అరరే! దుర్మార్గుఁ డెంత చేసెను! ఒక్కనిముసమునకు ముందీ కాగితము నా యొద్దకుఁ జేరినవాని నిచ్చటనే బంధించి యుందును గదా! కానిమ్ము. వీనిని బట్టుట యన నెంత!

చ. ఇలఁగలభిక్షుకాకృతుల । నెన్నిఁటిఁ దాల్చినఁ గాని వాని నే
యలవుననైనఁ బట్టి పురి । యందలి పౌరజనంబు లెల్ల ని
శ్చలమతులై నుతింపఁ జెఱ । సాలను జేర్చి విధింపరాని శి
క్షల నలయింపఁజేతునిది । సత్యము. సత్యము. సత్య మెమ్మెయిన్

(ఏదియో విచారించుచుండును.)

(గుల్‌సుము త్వరగాఁ బ్రవేశించును)

గుల్—అయ్యా! యోగీంద్రబాబెక్కడ? నన్ను రక్షించిన మహానుభావుఁ డెక్కడ? ఇంకఁ బ్రాణములతో నున్నాఁడా?

అరిం—అమ్మా! నీ దేయూరు? నీ వెవ్వరు?

గుల్—అయ్యా నా దీయూరే. నా తండ్రి తమిజుద్దీను. నా పేరు గుల్‌సుము. నన్ను మాతృ మాయనయొద్దకుఁ బోనిండు. తరువాత మాట్లాడెదను.

అరిం—సరే పొమ్ము. (అందఱును బాట నిత్తురు)

గుల్—(యోగీంద్రునికన్నులలో నేదియో వేయును).

యో—(కొంచెము సేపటికి దిగ్గున కొంతవఱకు లేచి) ఓహో! గుల్‌సుమ్—గుల్‌సుమ్. ఏలవచ్చితివి? రమ్ము రమ్ము వీ రంద ఱెవ్వరు? మనవారే. రండి రండి (పడి పోవును).

గుల్—అయ్యో! బాబుగా రింక సజీవులే.

అరిం—సంతోషము. సంతోషము.

ఉ. వాయుతనూజుఁ డా తరణికే నంశభవుం డగులక్ష్మణుండు దు
ర్జ్ఞేయపుశక్తిబాణమునఁ కే జేడ్పడుచుండిన వేళ నోషధుల్
వాయనిభక్తిఁ దెచ్చి వడిఁ కే బ్రాణముఁ బ్రోచినయట్లు కాఁటికిం
బోయెడువాని నిట్టియెడఁ కే బ్రోచితి వెంతటి పుణ్యురాలవో!

అమ్మా! ఏ వీధినో యున్న నీ కీవిషయ మెట్లు తెలిసినది?

గుల్—అయ్యా! నిన్న సాయంసమయమున బాబుగారును దుష్టుఁడైన పూల్‌సాహెబును మా యింటియొద్ద నుండి కలసి వెళ్ళిరి. ఆ వెళ్ళుటకుఁ బూర్వమే సాహెబువిషయ మంతయు బాబుగారికి విశదీకరించితిని. ఆయన నామాటలను లెక్క చేసెనో లేదో? కాని కొంతసేపటికిఁ పూల్‌సాహెబు తిరిగివచ్చి తన కిష్టురాలును మా తండ్రిగారికి నామమాత్రి ముంపుడుకత్తెయునగు మోతీబీబీతో గుసగుసలాడుచు "విషమిళిత మగుపొగచుట్ట నిచ్చి యారాత్రి యోగీంద్రుని సారె కట్టించితినిలే" యని చెప్పుచుండ నేను విని యప్పటినుండియు నెప్పుడు తెల్లవారునా! ఆ మహానీయు నెప్పుడు దర్శించెదనా! నేను వెళ్ళువఱకు సజీవుఁడై యుండునో లేదో యనుచు నాలో నే నిట్లు తికమకలు పడుచుండ నింతలోఁ దెల్లవారినది. ఆ పొగచుట్టకు విఱుగుడు నే నెఱిఁగియుండుటచేఁ గనుచీకటితోనే బయలుదేఱివచ్చి నన్ను రక్షించినవాని కీ రక్షణముం జేయఁగలిగితిని.

అరిం—అమ్మా! నిన్న సాయంసమయమున నీబాబు మీయింటికి దేనినిమిత్తము వచ్చియుండెను?

గుల్—అయ్యా! నా చరిత్ర మామూలాగ్రము వినుఁడు. అందన్ని సంగతులును తేటపడఁగలవు నా తల్లి నాచిన్నతనమునందే కాలధర్మమొందినది. నా తండ్రిగారికి నేను దప్ప నితరసంతతి లేదు ఆ కారణమువలన నన్నెంతో గారాబముతోఁ బెంచుచుండిరి. ఇట్లుండఁగా వెనుకటినుండియు మా మంచిచెడ్డలను విచారించుచున్న

ఘనవైద్యులు ఆచార్యులవారు మా దురదృష్టమువలనఁ బరలోకము
న కరిగిరి. ఇంతలో మా నాయనగారిమిత్రుఁడొకఁడు డీ పూల్ సాహే
బును దీసికొనివచ్చి మంచివాఁడనియుఁ జురుకుగాఁ బనిసేయుడాక్టరుల
లో నగ్రగణ్యుఁ డనియుఁ జెప్పి వానిని మా యింటఁ బ్రతిష్ఠించి
పోయెను. అయ్యగారు మా యింటిలో నడుగు పెట్టుట మొదలు మా
కుఁ బ్రాప్తించిన లాభము లేమి చెప్పుదును!

సీ. కోశాధిపతి వేఁడ్కఁ । గొండవీటికిఁబోయెఁ
　　　　దివిదివంబుఁ జేరె మం । త్రివరుఁడపుడె
భృత్యగణము విశ్వ । సృత్పట్టణముఁ జొచ్చె
　　　　ననుచరుల్ లక్ష్మీశు । ననుసరించి
రతిపేర్మిఁ జూపు దా । యాదులెల్లరుఁ గూడి
　　　　యాముష్మికమునకై । యరిగి రంత
భద్రేభతతిదీర్ఘ । నిద్రకై వేంచేసె
　　　　హయములన్నియు నుత్త । రాశ కరిగె.

తే గీ. గోగణంబెల్ల నొక్కటఁ । గూలెఁ, దల్లి
　　　　దండ్రు లిరువురునుం గాల । ధర్మ మొంది
　　　　రకట! యంతటిసంస్థాన । మంతరింప
　　　　బ్రతికియుంటిని జీవచ్ఛ । వాబు రీతి.

(దుఃఖించును)

అరిం—అమ్మా! ఊరడిల్లు మూరడిల్లుము.

గుల్—నాయనా! నా దురవస్థ నేమని చెప్పుదును. మా
తండ్రి, బ్రదికియున్నపుడే దుర్మార్గుఁ డాయనను దనవలలో వేసికొని
రెండవ వివాహమును జేసికొననీయక తనప్రియకాంత యగుజునులకు
"మోతీబీబీ" యను పేరుఁ బెట్టి తీసికొనివచ్చి యాయనకుఁ పుడుకత్తె
గా నియమించి దినదినము నాయువును క్షీణింపఁజేయు విషమిళితము

లగునాహారములఁ బెట్టించుచుండెను. నే నప్పు డప్పు డీ విషయము ను గుఱించి మా నాయనగారితోఁ జెప్పినను విను వాఁడు కాఁడు. పిమ్మట నన్నుఁగూడఁ జంపి నా పేర మా తండ్రి వ్రాయించియిచ్చిన యాస్తి నంతయు సంగ్రహింపవలయునని ప్రయత్నములు సేయుచుం డుట నేను గ్రహించి మా తండ్రిగారికిఁ జెప్పినను సమర్థించునంతటి దశలో లేఁడు కదా యని యెంచి యొకరిచేఁ జావనేల యని తలంచి

తే. గీ. ఇల్లు వాకిళ్లు లన్నియు ◊ నల్లకాటి
సమముగా నెంచి బ్రతుకు నా ◊ శను త్యజించి
చేరితిసి జేరువను నున్న ◊ చెఱువుగట్టు
వడి గ భీల్మంచు దుమికితి ◊ నడలు వీడి.

అరిం—ఆఁ ఏమీ! చెఱువులోనే పడితివా? ఎంతసాహసము! ఎంతిసాహసము! తరువాత నెట్లు బ్రతికితివి?

అంత నే దుముకుట గట్టుపైనుండి చూచుచున్న (యోగీంద్రు ని జూపుచు) ఈ మహానుభావుఁడు తటాలున లోని కుఱికి నన్ను బ యటికిఁ దీసి నాకుఁ దెలివికలుగువఱకుఁ బరిచర్యలు చేసి తదనంతర ము మా యింటికిఁ జేర్చెను. అంతట నా తండ్రి నా దురవస్థ విని బ యటికి రెండడుగులు వేసెనో లేదో ఇంతలో నా చావబద్ధము. నా యనగారి చావు నిజమునైనది. ఓ భగవంతుఁడా! న న్నింతకుముందే చంపక యేల విడిచితి వని దైవమును దూఱుచు నా తండ్రిగారిపై బడి యేడువసాగితిని. ఎంత యేడ్చిన నేమి లాభము? చచ్చినవాఁ డు మఱల జీవించునా? అంత నీ పూల్సాహేబు వచ్చి నా పరితాప మునకు నేఁ డే మొద లనునట్లుగా నక్కడనున్న వారిని వీరిని బిలిఁ చి శ్మశానమునకు సదుపాయమును జూచుచుండెను. ఈలోపల బాబు గా రెన్నిసారులు వెళ్ళవలెనని లేచినను "మన మిరువురిమును గలసి యచే వెళ్ళుద" మని యాఁపుచుండెను. నే నింతలోఁ గొంచెము

సందు చేసికొని భరింపరాని దుఃఖమున మునిఁగి కృశించు చున్నను నా ప్రాణదాతలు గదా! ఈ దుష్టునివెంటఁ బోయిన నేమి కీడుఁ జేయఁ దలపెట్టునో యని ఫూల్‌సాహేబును గూర్చి యు నన్నుఁగూర్చియుఁ జెప్పవలసినవన్నియుఁ జెప్పితిని. ఈ బాబు నామాటలను పాటించెనో లేదో; కాని తుద కిరువురుఁ గలిసియే వె ళ్ళిరి. కలసి వెళ్ళుటవలనఁ గలిగినఫల మిది.

అరిం.—అమ్మా! యతఁ డెంతకాలమునుండి మీయింటఁ బని సేయుచుండెను.

గుల్—దాదాపుగా నా లేంద్లైనది.

అరిం.—మోతీబీబీ జుమీలియా యనియు నది ఫూల్‌సాహే బున కుంపుడుకత్తె యనియు నీ వెట్లు తెలిసికొంటివి?

గుల్—అయ్యా! ఈ విషయము నే కాదు. ఇంక వీఁడు చే యుచున్న యనేకదౌష్ట్యములను నేఁ దెలిసికొనుచున్నాను.

అరిం.—ఎట్లు తెలిసికొనుచుంటివి?

గుల్—అయ్యా! ప్రతిదినమును వాఁడు గావించుదౌష్ట్యము లను మంచినిశీథ సమయమున మోతీబీబీని జేరి విశదపఱచుచుండును. సంవత్సరమునుండి నాకు నిద్ర యనునది యెట్టిదో లేదు. నేను నిద్రిం చుచున్నటులనే పరుండి వారు మాటలాడువిషయము లన్నియు గ్ర హించుచున్నాను. వానికంటె మోతీబీబీ మిక్కిలి యాలోచన గల ది. ఆపె నియమింపనిదే వాఁ డేపనియును జేయఁడు అది యెట్టిప న్నుగడలైనను బన్నగలదు.

అరిం.—వారెప్పుడైన మా తాణాకుఁ బంపిన శవమునుగుఱించి మాటలాడుచుండిరా?

గుల్—(ఆలోచించి) ఆ! చెప్పుకొనుచుండిరి.

అరిం.—ఏమిచెప్పుకొనుచుండిరి?

గుల్—ఏదియో చెప్పుకొనుచుఁ బకపక నవ్వుకొనుచుండిరి. ఆద్యంతములు నాకుఁ జక్కఁగా బోధపడకపోవుటచే గట్టిగా జ్ఞాపకముంచుకొనలేదు.

అరిం—ఏమియు జ్ఞాపకము లేదా?

గుల్—కొందఱిపేర్లు చెప్పగలను.

అరిం—అవేవియో చెప్పుము?

గుల్—గౌరిచందు-రోహిణి ఇంక నేవియో చెప్పుచు నా మాఁటఁటపేరు కేశవచందు అని చెప్పుచుండెను.

అరిం—సరే! నీకు వివాహ మైనదా?

గుల్—లేదు.

అరిం—ఇంత వయసు మీఁజినదాఁక నేల యూరకుంటివి?

గుల్—అయ్యో! నా తండ్రి చక్కఁగాఁ దిరుగుచున్నపుడు "సిరాజ్‌హీన్" అనునతని దీసికొనివచ్చి నన్నిచ్చి పెండ్లి సేయుతలంపున మా యింటనే యుంచి విద్యాబుద్ధులన్నియుఁ జెప్పించుచు వానికున్న జమీంబారినంతయు మాతండ్రిగారే సరిచూచుచుండిరి; కాని నా దురదృష్టమువలన మాతండ్రిగారికి వ్యాధి ప్రబలమై చావసిద్ధముగా నుండెను. ఆయన చచ్చినచో నీయాస్తికంతయు "సిరాజ్‌హీన్" కర్త యగుననియుఁ దమకేమియుఁ జిక్కదనియు నెంచి యీ పాపాత్ము లేమిచేసిరో; కాని నెలనుండి కనుపించుటలేదు.

అరిం—చంపిరా యేమి

గుల్—వారిసంభాష[illegible] వినఁగాఁ జంపినట్లు లేదు; కాని వారికేదో పాతాళభవన ము[illegible]ను, అక్కడ దాఁచియుంచినట్లును దెలియుచున్నది.

అరిం—ఇంత కాలమునుండి యధికారవర్గమున కేల తెలియఁజేయవైతివి?

గుల్—అంతపనికిఁ గడఁగిన నాఁడే నాకుఁ బరలోక ప్రాప్తి.

యో—(లేచి కన్నులు నులుముకొని యరిందముని జూచి) (బాబూ)! రండి! రండి! రాత్రి యేమైనదా.........................

అ—ఏమైనదో దేవుఁడెఱుఁగును. త్వరగా ఠాణాకుఁబోవలయును. కొంచెమన్న మ్రింగిలిపడి రండు.

యో—చిత్తము.

అరిం—అమ్మా! ఆ దుర్మార్గులకుఁ బ్రాయశ్చిత్త మగువఱకు నీవు మా యింట నుందువా?

గుల్—చిత్తమట్లే యుందును.

స-ఇ—అరిందమ బాబుగారూ! ఈ మనయోగీంద్రుని బాధవలన మీరు మంచిభోగట్టాను సంపాదించితిరి. ఇఁక వాండ్రి నవలీలగాఁ బట్టవచ్చును.

అరిం—అయ్యా! ఇఁకఁ దటాలునఁ బట్టవచ్చు ననుకొంటిరి కాబోలును. దారిద్ర్యదురంధర సజ్జనదీక్షానివారిత బంధురుండగు వాఁడు సామాన్యమానవుఁడు కాఁడు. వానినిఁ బట్టుట కేదేనిఁ గ్రొత్తయెత్తు నెత్తవలయును.

స-ఇ—(ఆశ్చర్యముతో) ఆఁ అంతి యలవి కానివాఁడా?

అరిం—ఔను! రండు మనము ఠాణాకు వెళ్ళుదము.

(అందఱు నిష్క్రమింతురు)

2 వ రంగము—ఉద్యానవనమును అందొక మేడయు

(మారువేసములతో నిద్దఱు సార్జంటులును యోగీంద్రుఁడును. అరిందముఁడును బ్రవేశింతురు.)

అరిం—(అటు నిటు చూచి యోగీంద్రునితో) ఏమండోయి! వాఁడు తోఁటలోఁగాని మేడవెలుపలిభాగమునఁ గాని లేఁడు. మనకిదె మంచియదను లోనికేగుదమా?

మో.—మంచిది నిశ్శబ్దముగా బదండి (అందఱును దోఁటలోని కేగుదురు.)

అరిం.—బాబూ! మీరందఱు నిచ్చటనే యుండుఁడు. నేను మేడదరి కేగి వాఁడేమి చేయుచున్నదియుఁ గనిపెట్టి వచ్చెదను.

మో.—చిత్తము జాగ్రత్తగా మెలంగుఁడు

అరిం.—ఆవిషయము నాకుఁ జెప్పనక్కఱలేదు లెండి (మెల్లగా మేడదరి కేగి క్రిందిభాగము లన్నియు శోధించి యచ్చట లేకుండుట చే బయటనున్నవారికి సంజ్ఞచేయుచు మేడపై కేగి కొంత సేపటికిఁ దిరిగి వడివడిగా వచ్చి యొకబల్లమీఁదఁబండుకొనును.)

ఫూల్.—(మేడ దిగి బయటికి వచ్చుచుండును.)

మో.—(డాక్టరున కెదు రేగి కొంచెముదుఃఖభావముతో అయ్యో! (అరిందముని జూపుచు) ఈ మనుష్యునికి మూర్ఛ వచ్చినదండి! ఇదివఱకీ పట్టణములో నున్న డాక్టరులందఱకు నప్పుడప్పుడుచూపించినామండి! ఎవరివల్లను గాలేదు. ఆలాగుననే కొంచెము బాధపెట్టి క్రమక్రమముగాఁ దగ్గిపోవుచుండెడిది. ఈవేళ నట్లు కాదండి. జాము సేపటినుండియు యథాప్రకారముగానే యున్నది. మీరు చాల కీర్తి గలవారనియుఁ బెద్దవైద్యులనియు విని తమయొద్దకు వచ్చితిమి. ఇదెట్టి మూర్ఛలోఁ జేరినదో తమరు కొంచెముపరిశీలించి తగినయౌషధమీయండి! మీ మే లెన్నఁటికిని మఱచిపోము.

ఫూల్.—(తొందరగా వచ్చి పరుండినమనుష్యు నదేపనిగాఁ జూచుచుండును)

మో.—(వెనుకప్రక్కఁ గాచుకొని యుండును)

సా.—(చెఱియొకవైపునకుఁ జేరుదురు)

ఫూల్.—(అరిందముఁడని గ్రహించి తనయొఱలో నున్నకత్తి

ని దూయుచు) ఓరీ! అరిందముండా! నీ జిత్తులు నాకడనా? (కత్తి నెత్తి నఱకఁబోవును)

మో—(వెనుకనుండి మెత్తుటగోడనే కత్తిని లాగుకొనును)

సా—(చెఱియొక చేతిని బట్టుకొందురు)

ఫూల్— (విడుల్చుకొనుచుండును)

అరిం—(మెల్లఁగా లేచి వాని రెండు చేతులకు బేడీలు తగిలించి బయటికి లాగుకొనివచ్చి)

ఉ. ఓరి మహాఘోరపాతకుఁడ! నీ మోటుతనంబు నోర్వలేక యిందరకొ
భోరఁగఁజూచుచుంటి వికఁ నీ బొమ్మెట కేగెదో? నీతిమాలి ని
ష్కారణవైరమూని యధినీకారులపైఁ జెలరేఁగుచుండ నీ
బీరము సాగునా? యెపుడొ నీ పీఁకెను ద్రుంచును గాని దుర్మతీ!

ఫూల్—ఓరీ! యరిందముండా! ఇంతమంది చేరి యిన్ని కుయుక్తులు పన్ని యొక్కనిఁ బట్టుకొనుట పౌరుష లక్షణమా? శక్తిమంతమా?)

అరిం—దుష్టా! ని న్నొక్కనినే కాదు లోపల నీతో మాట్లాడుచున్న వారినికూడ బంధించెదను. (యోగీంద్రునితో) బాబూ! మీరితనిఁ జెఱసాలయొద్దకుఁ దీసికొనిపొండు. నేను లోపలనున్న వారిని బట్టుకొని వచ్చెదను.

మో—అయ్యా! వాఁ డింత సేపచటనే యుండునా? ఇదివఱకే కంతను బడియో తప్పించుకొనియుండును. అదియునుఁ గాక యితఁడున్న యింటిలోనికి బాగుగాఁ పరిశీలింపనిదే వెళ్ళరాదు.

అరిం—సరే! పదండి. తరువాత నాలోచింతము.

మో—చిత్తము— (అందఱు నిష్క్రమింతురు)

3 వ రంగము—పోలీసుస్టేషను.

(అరిందముఁడు, యోగీంద్రుఁడు ప్రవేశింతురు)

మో—బాబూ! ఫ్రూల్ సాహేబు నెట్లెట్లో బుట్టలోఁ బెట్టి

తిరి; కాని జిత్తులమారిజుమీలియాను బట్టుకొనుట కష్టతరము.

అరిం—అయ్యా! కష్టమనితలంచినయెడల మన మేపనినిగూడ నిర్వహింపలేము. పరోపకారమే మైనచోఁ గష్టము గాని సౌఖ్యము గాని చూడక కలిగి పనిచేసినఁ గీర్తియును నాముష్మిక సౌఖ్యమును దప్పక సంపాదించినవార మగుదుము.

మో—అయ్యా! వాఁడు పెట్టినచిక్కులకు మీరు గనుక నెదిరించి సంకెలలు దగిలించితిరి; కాని నా బోటివాఁ డింతపని జేయఁ గలడా?

అరిం—(నవ్వుచు) తమ రంతవారు కావుననే మమ్ము నందఱి నంతగాభరా పెట్టితిరి.

మో—(నవ్వుచు) మీ రావిషయమును మాత్రము మఱచి పోనట్లున్నది.

అరిం—ఎట్లు మఱపు గలుగును? ఇంతవిషయమా? అంతవిషయమా?

మో—ఔనుగాని జుమీలియామాట యేమనుకొంటిరి?

అరిం—(హాస్యముగా) అది మీ పని.

మో—(ఆత్రముతో) మీ పుణ్యము నా నెత్తిమీఁదఁ బెట్టకుఁడు.

అరిం—ఓహో! ఇంతలోనే పిఱికితనమును వెల్లడి చేయుచున్నారే!

మో—ఔను. మీ యొద్ద నిజము నే చెప్పవలయును. శక్తిలేనపుడు పటాటోపముగా మాటలాడిన నేమి లాభము?

అరిం—సరియే! జుమీలియాను బట్టుకొనుటకు నేనే వెళ్ళుచున్నాను. ఈపూల్ సాహేబు సామాన్యమానవులలోనివాఁడు కాఁడు. ఇంద్రజాలమహేంద్రజాలటక్కుటమారగోకర్ణాది విద్యలయం దారితీఱిన

వాఁడు. కాపున్న మీఁదుమాత్రము.

తే. గీ. కార్యధుర్యులుఁ, బటుశౌర్య ధైర్యయుతులుఁ
జండతరఖడ్గసంయుతో దండబలులు
నైనభటులన నుత్కటముగా నరసి కాపు
పెట్టుఁ డీ కారయొద్ద నీ ప్సితము మీఁఱ.

మో—చిత్త మట్లే కాపుంచెదను. మీరు పాణముమీఁదికి వచ్చునట్లుమాత్రము నటింపవద్దు. యుక్తులలో నది వీనికంటె మించిన దని వాఁడే చెప్పుచున్నాఁడు. పిఱికితనముతో నిట్లు చెప్పుచుంటి నని తలంపక జాగ్రత్తగాఁ బోయి రండు.

అరి—నే నంతమందమతితో వర్తించుటయింతకుముం దెన్నఁడును లేదు. మీరు మాత్రము నే నింటి కేగి భోజనముసేసి వచ్చులోపల నిరువురుపోలీసులకు రెండు జతల బేడీల నిచ్చి యుంచుఁడు.

మో—చిత్తము.

(ఇరువురు నిష్క్రమింతురు)

4 వ రంగము—తినిజుద్దీన్ ఇల్లు.

(దాసి యొక తె వాకిటఁ గసవుఁ జిమ్ముచుండఁగా నిరువురు
రక్షకభటులతో నరిందముఁడు ప్రవేశించును)

అ—అమ్మా! నీ వెవ్వతెవు?

దా—నే నీ యింటిదాసిని.

అ—మీ యజమానురాలి పే రేమి?

దా—మోతీబీబీగారు.

అ—ఇప్పు డింటిలోనున్నదా?

దా—ఉన్నది. లోన నేమో చేయుచున్నది.

అ—పిలిచిన బయటికి వచ్చునా?

దా—రాదురాదు. డాక్టరుజీ గాని నేను గాని పిలువనిదిబయ

టికి రాదు. సరికదా లోపలినుండి జవాబైన నీయదు.

అ—నీ విప్పుడు పిలువవలయునే?

దా—ఏమో బాబు! నేను బిలువను. మీరు దేనికొఱకు వచ్చితిరో? మీ రాక యామె కేదేని గోపకారణ మైనచో నీపొట్ట కూటికిఁ గూడఁ జెడవలసివచ్చును.

అ—అమ్మా! నీ కొక మాట చెప్పెదను వినుము. మేము నీ యజమానురాలి నిప్పుడు తప్పకుండ నేవిధముననైనను బంధించి చెఱసాలయందు దుంచఁబోవుచున్నాము. తరువాత నీవిక్కడ నుండి యెవరిని గొలుతువు? ఏదో యొకదారిని బట్టవలయును గదా! నీ కంతటి కష్ట మేటికి? నీ యావజ్జీవపర్యంతము భుక్తికిఁ జాలినంతధన మిప్పింతును. ఆబిడ నొకసారి యిటు పిలువుము, ఏమనెదవు?

దా— అయ్యా! మీరు నిశ్చయముగా నిత్తురా?

అ—తప్పక యిచ్చెదము. నా మాట నమ్ముము. సంశయపడ నవసరము లేదు.

దా—చిత్తము (బిగ్గఱగా) అమ్మగారూ!

(తెరలో)

దాసీ! ఏటికే?

దా—అమ్మా! ఒక్క మాటు బయటికి వచ్చెదవా?

(తెరలో)

ఆ వచ్చుచున్నాను. (జుమీలియా తలుపుఁ దెఱచుకొని బయటికి వచ్చి యరిందమునిఁ జూచును.)

జు—(దాసితో) ఓసీ! నీవును వారిలోనే చేరితివా? (అని దాసిని గత్తితోఁ గొట్టును. దాసి పడిపోవును. జుమీలియా లోనికిఁ బరుగెత్తును.)

అ—పోవద్దు. ఎచ్చటికిఁ బోయెదవు? (అనుచు రక్షకభటులతో లోని కరిగి జుమీలియాకు సంకెలలు వేసి జుట్టు పట్టుకొని లాగికొని వచ్చును.)

జు—ఓరీ! యరిందముఁడా! నన్నిప్పు డెచ్చటికిఁ గొంపో యెదవు?

అ—నీ పాప మెచ్చటికిఁ గొంపోనున్నదో యచ్చటికి.

జు—(కొంచెము దుఃఖముతో) ఓరీ! పౌరుషహీనుఁడా! మగఁటిమికి భంగము వాటిల్లు ననియైనను దలంపక యిట్లు తగవుమాలి నిష్కారణముగా మాబోఁటి యాఁడువాండ్రపై దాడి వెడలుచుంటివా.

అ—ఓసి ఘాతినీ!

—వేంకటరమణావృత్తము.—

పురపురఁ బొగులుచు నీకే పోలుపున నక్కగతిం
దరుణిరో! వినయములంకే దగు నని పల్కెదవా?
చిరచిర యలుకను దాకే సిని దెగవేసితివా
దురితము వడివడి నింకే దునుమక పీఁకు నె చీ.

ఇంక నెన్ని యేనియుంగలవు. పాతకీ! తమిజుద్దీన్ సంస్థానమంతయు బాడుచేసి తుద కాయనను గూడ. నీ పొట్టను బెట్టుకొనలేదా? సిరాజ్ హీను నెక్కడనో మటుమాయము చేయుంచినది నీవు కాదా! ఏమి పలుకవు?

జు—నే నని మీరు నిరూపింపఁగలరా?

అ—నే నిరూపింపనవసరము లేదు. అన్నియు నీ విటకాఁడు ఫూల్‌సాహేబే నిరూపించినాఁడు.

జు—ఫూల్‌సాహేబుగారే చెప్పిరా?

అ—నిస్సంశయముగా.

జు—ఆయనగారిని మీ రెక్కడఁ గలిసికొంటిరి?

అ—వాని బంగళాలోనే.

జు—ఇప్పు డొకసారి పిలిపింతురా?

అ—(నవ్వుచు) నిన్న తనియొద్దకే తీసికొని వెళ్లుట.

జు—ఆయనగారు బంగళాలోనే యుండిరి కదా!

అ—మేము నీ సంగతిఁ దెలిసికొనునపు డతఁ డక్కడనే యున్నాఁడు.

జు—ఇప్పుడో?

అ—(నవ్వుచు) చెఱసాలలో.

జు—ఆఁ ఏమీ? నా వలెనే ఆయనను గూడ బంధించితిరా

అ—(నవ్వుచు) నీ వలెనే కాదు. అతనికిఁ గాళ్ళుకూడ బంధించితిమి.

జు—(కోపముతోఁ గూడిన దుఃఖముతో) అరిందముఁడా! నీకీ యదరిపా టెంత సేపో విచారించుకొనకున్నావు. ఛీ! ఛీ! కఠినహృదయా! నన్ను నీ పాలిఁటి మృత్యుదేవత యనుకొమ్ము.

ఉ. ఏటికి మాటిమాటి కిటు లీ హేళనముం బొనరింతు మూఢ! నీ
పాటును జూచుకొమ్ము పరభామల సిట్టులఁ జెడ్డబుద్ధితో
మేటిమగండనంచుఁ జెఱఁ బెట్టిన నారకపోవు నేకడుం
జేటును గూర్చుఁ గాక వడి శ్రీతోఁ గంగ ననారతం బిలన్.

అ—(నవ్వుచు) జునులా! నిన్ను మృత్యు దేవతవే యగుదువు. కాకున్న నీ కీ గతి పట్టునా?

జు—పిఱికిపందా! నీ యికిలింపులు సకిలింపులు నెన్నినాళ్ళో చూడుము. సింగముతోఁ జెరలాటమా? అగ్నిహోత్రినిఁ నాముద్దుపెట్టుకొనుట? త్రాఁచుపాము నా తలక్రిందఁ జేర్చుకొనుట? అలోచించుకొనుము. ఏల చెడిపోయెదవు?

అ—(కోపముతో, నీ ప్రగల్భములు నీ శక్తియు నే నెఱుగ కపోలేదు. త్వరత్వరగా నడువుము (లాగుచు.

రం—భ—గోవిలో నాలసించిన నేమి లాభమున్ పద పద. అ క్కడ మీా సాయబయ్య నీ కొఱకె యెదురు చూచుచున్నాడు. లాగి కొని వెళ్లుదురు.)

(తెర పడును.)





శ్రీ

# అరిందమ విజయము.

## చతుర్థాంకము.

(దేవేంద్రవిజయుడు ప్రవేశించును.)

దే—(విచారముతో నిట్టూర్పుపుచ్చి స్వగతము) హా విధీ! చిన్ననాటినుండియు. నా యన్నలమిన్న మీఁద నే కన్ను పెట్టి యెందఱెందఱు తమకన్నెల నిత్తుమని వచ్చిన నొప్పుకొనక యున్న నన్నెంత చేసితివి? అయ్యో! నిన్ననఁ బనియేమి? నా కారేవతిని గూడు భాగ్యము లేదు కాఁబోలు (రేవతి నుద్దేశించి) ఆహా!

మ. వనితా! నిన్ననులాఁగఁ గాంచి తమిసం కే భాషించిమోహించియం
 తనె చిత్తంబునఁ గోర్కెలెల్ల నిగురెత్తం గాటమా కూర్మిఁ జ
 య్యన నాలింగన మాచరించి యధరం బాసింపవల్గుచు సి
 గ్గునఁ గ్రీడించెడు నీదుచెల్మి యెటు నాకుం గల్గు దౌర్భాగ్యుఁడన్

అయ్యో! ఇంక నా కాబంగారుబొమ్మ లభించునా? నే నేల లేనిపోని మోహంబునం బడి యిట్లు కొట్టుకొనవలయును? అక్కటా! అట్టులని యూరకుండు టెట్లు? ఇప్పుడే యరిందముఁ డెక్కడనో యున్నట్లు తెలిసికొంటి ననియు దానికి నీవు కూడఁ దోడుపడవలయు ననియు నుత్తరము వ్రాసెను గదా! నే నిప్పుడే బయలుదేఱి వెళ్ళి వానిమాట

లెంత నిజమో కనుఁగొని యక్కడి కాయాసను గూడఁ దీర్చుకొని యెదను.

(నిష్క్రమించును.)

—ఇది విష్కంభము—

1 రంగము:—కారాగారము.

(కావలికాయుచు సిపాయి యొకఁడు ప్రవేశించును.)

సి—(స్వ) ఆహా! ఈ లోకైకమోహినిం జూచినప్పటినుండి యు నేదియో యున్మాదము సంభవించినట్లు నా మనస్సంతయు నీ యన్నులమిన్న పైఁ గీలుకొని మాటిమాటికి నాబిడయవయవశృంగార మునే కొనియాడుచున్నది. మఱియింపుదమన్న సాధ్యము గాక నా దృక్కు లెప్పుడు నా వంకకే పరఁగుచున్నవి. ఓహెూ! నాకే యిట్లున్న దననేల? ఈ శృంగారవతిని గన్నాఱఁ జూచిన నా యంగజుఁడు సైతము రతీదేవికి గతులు లేకుండఁ జేయఁడా? ఆహా! ఎన్నినాళ్ళు బ్రదుకుటకన్న నీ వన్నెలాఁడితో నొక్కగడియ సౌఖ్యమనుభవించి చచ్చినను మేలు గదా! ఆఁ ఏమిది? నాకు విధించినకార్యమునందుఁ బ్రమత్తుఁడనై లేనిపోనివ్యసనంబునం బడి కొట్టుకొనుచున్నానే? వ్యసనమేమి? ఆ వగలాఁడితో నొకసారి మాట్లాడినను జాలుఁగదా! అబ్బా! ఈ తమి నెట్లు నిలుపుకొందును? ఓహెూ!

ఉ. మారుఁడు క్రూరుఁడై కరుణ మాలి శరాసనముం ధరించి వి
స్తారసుమాంబకంబులను స్వాంతము నాడఁగ గుప్పుచుండెనే
దారియుఁ దోఁపకున్నయది తాళఁగ నోపికపూజ్యమయ్యె! శృం
గారమ నీవు నిశ్చయముగా వ్యసనార్తులపాలి మిత్తివే.

(వినుట నభినయించి) ఓహో! సవినయముగాఁ బిలుచుచున్నదే. నా మనోరథ మీడేర్చునా యేమి? (చెఱసాలదిక్కు మొగమై) కాంతా పిలిచితివా?

జు—(లోపలినుండియే సంభాషణ) పిలిచితిని. తమ స్వగ్రామ మేయూరండి?

సి—జబల్ పూర్.

జు—మీకు వివాహమైనదా?

సి—ఐనది.

జు—తమభార్య కాపురమునకు వచ్చినదా?

సి—వచ్చినది. (స్వ) ఓహో! ఈ సుందరి నా యూరు పేరు లడుగుటయే కాక పెండ్లియైనదా, భార్య కాపురమునకు వచ్చినదా! అను నీవిషయముల నడుగుచున్నదే. ఏటికై యుండును?

కం. నాకుం గలిగినపిచ్చియె
యీ కంజాక్షికిని గూడ ? నావేశంబై
యీకరణిఁ బల్కఁజేసెడిఁ
గాకుండిన నింత ప్రేమ ? కలుగఁ బలుకునే?

బళే! ఇంక నేమనునో చూచెద (వాకిలిడగ్గఱఁ జేరును)

జు—మీరు సకుటుంబముగా నిక్కడకుఁ గాపురము వచ్చితిరా ?

సి—లేదు! లేదు! నే నొక్కఁడనే యున్నాను.

జు—మీకు భోజనాదు లెట్లు జరుగుచున్నవి?

సి—ప్రస్తుతము నేనే చూచుకొనుచున్నాను.

జు—అయ్యో! ఇది యెంత వెఱ్ఱితనము? అక్కఱకు వచ్చిన భార్య నొంటరిగా విడిచి యీస్వల్పనౌకరీలో నింత దూరమున నుండుటయే కాక వంటసదుపాయములు స్వయముగాఁ జూచుకొనుట తమకుఁ గష్టముగా నుండలేదా?

సి—కష్టమే. అయిన నౌకరియుప్పుపులుసుఁ దినుచున్నప్పుడు కష్టమైనను సౌఖ్యమైనను భరింపవలయును గదా!

జు___తమ కెంత వేతన మిత్తురు?

సి___ఇరువదిరూపాయ లిచ్చెదరు.

జు___అయ్యో! తమ కిదేమి లాభము? ఈకాలములోఁ గూలి వానికి సైతము దినమునకుఁ బండ్రెండణాలుమొదలు రూపాయకు మించి యిచ్చుచుండిరే. పగలెల్లను గష్టముచేసినను బొద్దుకుంకుసరికి వారివారినిలయముల కేగి తమవిలాసవతులను దర్శించినంతమాత్రముననే పగలు వా రనుభవించినశ్రమ యంతయు సౌఖ్యముగ మారి రేయంతయు సర్వసౌఖ్యములు ననుభవింపుచు మీకంటె నెక్కువలాభమును దీయుచుండిరే. మీ కిదేమి పిచ్చి? అహోరాత్రములు నిద్ర లేకపోవుటయే కాక యెప్పుడు నొకతుపాకిని గత్తిని జేతఁ బూని మోటలాగు నెద్దువలె విరామము లేక యటు నిటుఁ దిరుగుచుండుట మీకు సౌఖ్యముగా నున్నదా యేమి?

సి___సుఖమో కష్టమో ఒప్పుకొనినవెనుకఁ దప్పదు కదా!

జు___యౌవనదశయందున్న మీరు మీ ప్రియురాలి నెచ్చటనో విడిచి యెట్లుండఁగలిగితిరి?

సి___అవసరమగునప్పుడెల్ల సెలవు గైకొని వెళ్ళి వచ్చెదను.

జు___మీకుఁ బరశృంగారవతులపై వాంఛ లేదా?

సి___ఊడిన నెట్లు వశ్యు లయ్యెదరు?

జు___(చిఱునవ్వుతో) పోనీ మిమ్మెవ్వరైనఁ గోరినచో నేమందురు?

సి___(స్వ) ఓహో! ''ఎవ్వరైనఁ గోరినచో నేమందు'' రనుచున్నదే. ఈ ప్రశ్న కేమి యుత్తర మిత్తును? నా కోర్కె కొనసాగుట యంతయు నిం దిమిడి యున్నది. అయిన నిట్లు మాట్లాడెదఁగాక (ప్ర) నాకిష్టమైనచోఁ దప్పక యొప్పుకొందును.

జు___(నవ్వుచు) తమపై నాకుఁ గోరికకలదు. ఏమందురు?

సి—నిజముగా నున్న యెడల నా సందేహ మేమి?

జు—అట్లయిన మనమిరువుర మొక్కచోటఁ గూడు టెట్లు?

సి—తాళము చెవి నా దగ్గఱనే యున్నది.

జు—ఎవరైన లేతురేమో నిశ్శబ్దముగాఁ దలుపులు దీయుఁడు.

సి—ఆలాగుననే (కొంచె మీవలికి వచ్చి చంకలు గొట్టుకొనుచు)

—ఏవి భూ తి వృ త్త ము—

అన్నుమిన్న లందునన్
వన్నె కెక్కినట్టి యీ
వన్నెలాఁడిఁ గూడెదన్.
జెన్ను మీఱఁగు లెక్కదన్.

పరమసౌఖ్య మొందఁ దామసింప నేల (తాళముఁ దీసి లోనికేగును. కొంతసేపటికి జుమిలియా ఫూల్ సాహేబున్నగది తాళముఁ దీసి వానిని బయటికిఁ బిల్చి రహస్యముగా నేమో చెప్పును. వాఁడు మొదట జు మీలియా యున్నగదిలోనికి వెళ్ళి వెంటనే తిరిగి వచ్చును. ఇద్దఱును గలసి నిష్క్రమింతురు.)

(రెండవసిపాయి ప్రవేశించును)

2 సి—(చెఱసాలగదులతలుపులు తెఱచియుండుటఁ గాంచి) ఏమిది! రెండు ద్వారములును దెఱవఁబడియున్నవి! (త్వరగా నొకగదిలోని కేగి బయటికి వచ్చి) ఈ గదిలో ఫూల్ సాహేబే కదా యుండవలసినది? ఇం దెవ్వరును లేరే! (రెండవగదిలోని కేగి వెంటనే బయటికి వచ్చి) అయ్యయ్యో! ఏమీ యన్యాయము! చెఱసాలనుండి తప్పించుకొనిపోవుటయే కాక హంతకు లెంత దార్ఢ్యములఁ గావించి రి! అన్నన్నా! ఇత డేఁసనిమిత్తము లోనికరుగవలసివచ్చినది? ఇవన్నియు జుమీలియా జిత్తులుగాఁ దోఁచుచున్నవి. కట్టా! స్త్రీ లెంతకైనను జా లుదురు గదా!

తే. గీ. పయఁట సడలించి భూషల కే వహాయలు సూపి
వాలుఁజూపులు పఱఁగించి కే వలపుఁ గొలిపి
యెట్టిఘనునైన క్షణములోఁ కే గట్టివైచి
యిచ్చవచ్చినరీతిఁ జే కే యించుకొందు(రు).

ఇంక నే నిట నాలస్యము సేయుట యేల? వీనిని లేపి అరిందమబాబు గారికిని, యోగీంద్రనాథబాబుగారికిని నీ విషయము దెలుపఁ బంపెద ను (అచ్చట నిద్రపోవుచున్న మూఁడవసిపాయివీఁపుఁ దట్టుచు) ఓయి! ఓయి! లెమ్ము లెమ్ము!!

3 సి—(లేచి కన్నులు నులుముకొనుచు) అప్పుడే యేల లేపితి వి? మూఁడవజామింక వెళ్లలేదే!

2 సి—లేదు! లేదు!! మూఁడవజామింక వెళ్ళలేదు నీవింకఁ గావలియుండ నవసరములేదు.

3 సి—అదేల?

2 సి—ఏటికో చెఱసాలవంకఁ జూడుము.

3 సి—ఏమది? తప్పించుకొని రాయేమి?

2 సి—తప్పించుకొనుటయే కాదు. మనగోవింద్ జీనిఁదెనగఱకి యుం గూడ వెళ్ళిరి. చూడుము! (మొండెములను జూపును.)

3 సి—(చూచి) అయ్యో! అయ్యో!! ఇదేమి యన్యాయము?

2 సి—అన్యాయమున కేమి కాని నీవు త్వరగాఁ బోయి అరిం దమ బాబుగారికిని, యోగీంద్రనాథ బాబుగారికిని నీవిషయ మెఱిం గించి (అంతలో నరిందముఁడు వచ్చుచుండుటను గాంచి) ఓహో! డిప్యూటీవృగారే వచ్చుచున్నారు. ఇంతరాత్రివేళ వారేల బయలుదేఱి యుందురు? మనలను బరీక్షించుటకా? లేక యీవిషయ మేమైనఁ దెలిసినదా? వెళ్ళిచెప్పెడు వారెవరును లేక యెట్లు తెలియును? (ఆ లోచించు చుండును.)

అరిం—(ప్రవేశించి) ఏమోయి! జాగ్రత్తగా నున్నారా? (చెఱసాల గదులు తెఱచి యుండుటఁజూచి) ఓహో! ఈ తలుపులు తెఱచి యున్నవి. కారణమేమి?

2 సి—అయ్యా! దీని నిమిత్తమే మీకడకుఁ గబురంపు చుండఁగా నింతలో మీరు వచ్చుచుంటిరి.

అ—ఏమి జరిగినది?

2 సి—అయ్యా! నాకు మూఁడవ జామువంతు. నావంతు ప్రకారము నేను లేచి చూతును గదా రెండవజామునఁ గాపున్న మన గోవిందజీ కనుపింపలేదు. పిలిచినను బలుకలేదు. నేనంతటఁ జెఱసాల గదులన్నియుఁ జూడఁగా నీరెండు గదులు మాత్రము తెఱచియున్నవి. జుమీలియు ఫూల్ సాహెబు లిరువురును లేరు. జుమీలియా యున్న గదిలో గోవిందజీ రెండు ఖండములుగా ఖడింపఁబడి యుండెను.

అ—(ఆశ్చర్యముతో) ఆఁ ఏమీ! గోవిందజీని నఱికిరా?

2 సి—అయ్యా! ఇవిగో మొండెములు. చూడుఁడు (గది తలుపులు చక్కఁగాఁ దెఱచి చూపించును.)

అ—(చూచి బయటికివచ్చి) ఆహా! అనుకొనినంతయే జరిగినది. చేఁ జిక్కిరిగదా యను గర్వముతో నేను దాళముచెవులు గోవిందుని కెప్పుడిచ్చి మఱచితినో అప్పుడే జుమీలియా యెత్తు సాగినది అప్పుడే నాశ్రమ యంతయు వ్యర్థమైనది. అప్పుడే గోవిందునికి మృత్యువాసన్న మైనది. లేకున్న నింటికి వెళ్లులోపల నాలుగైదు సారులు కారకాపరులయొద్ద కరిగి యొకసారికిఁ బదిసారులు జాగ్రత్తగా నుండుఁడని చెప్పి చివరకు విడిగదుల తాళముచెవులుగూడ భద్రపరచెడివాఁడను. నాయట్టి ప్రమత్తునికిట్టి శిక్షణమగత్యమే. గోవిందునివంటి మోహపాశబద్ధునికా మృత్యువు నగత్యమే. (కారకాపరులదిక్కు మొగమై) ఇంకననుకొనిన నేమి ప్రయోజనము? జరుగవలసిన దే

మోజరిగినది. మీరీ విషయము సూర్యోదయముననే యోగీంద్రునికె తెలిగించి వెంటనే యీ మొండెములను శాంతిపెట్టింపుడు. (నిష్క్రమించును.)

౭సి—మనమిఁకఁ బంపుకొందము (అందరు నిష్క్రమింతురు)

(తెర పడును.)

2 వ రంగము—జీవనపాలు తోఁట.

(జుమిలియా ఫూల్‌సాహేబులు ప్రవేశింతురు)

ఫూల్—జుమలా! అడుగుదమన్న నవకాశము చిక్కలేదు. మొదటఁ గారకాపరి నెట్లు వశపరచుకొంటివి? వాఁడెట్లొప్పుకొనెను?

జు—(నవ్వుచు) అంతశక్తి నాకడ లేనిచో మోహిననివలె నన్నేనాఁడో త్రిమ్మరిని జేసియుందురు.

ఫూల్—ఈ పరిహాసముఁలకేమిలే జరిగిన విషయముం జెప్పుము.

జు—నవ్వెదరేమో?

ఫూల్—నవ్వనేమి? సంతోషముతోఁ గదా!

జు—(హాస్యముగా) దుఃఖముతో నవ్వెదరోమో?

ఫూల్—ఈ చమత్కారములకేమి. చెప్పెదవా? చెప్పవా?

జు—చెప్పెదను వినుఁడు మీ చే వధింపఁబడిన యాతఁడు మొదట నన్నుఁ జూచిన దాదిగాఁ జీఁకటి పడునపు డెన్నియో సారులు నేనున్న గదిమొద్ద నిటునటు తన హావాయులన్నియుఁ జూపుచుఁ బిచ్చి పట్టిన వానివలెఁ దిరుగుచుండెను. నే నప్పుడే వీనికి మదనోన్మాద మెత్తినదని గ్రహించితిని. అంతఁ బొద్దు క్రుంకకముందే యతఁడు చెఱసాల యొద్దకు వచ్చెను. వాని యొద్దఁ దాళము చెవులుంచుటఁ జూచి మఱింత యాస కలుగునట్లుగా "అయ్యా! మీ కీరాత్రి వంతు

కలదా?" యని యడిగితిని రెండవ జామునఁ గలదని చెప్పి యచ్చ టనే పరుండెను. పరుండెనేకాని పాపము నిద్రిమెట్టిదో యెఱుంగఁడు. తన వంతునకై నిరీక్షించుచుండెను. ఇంతలో రెండవ జాము రా దిగ్గున లేచి తన యొద్దనున్న దీపపు వెలుఁగు నే నున్న గదిలోఁ బ్రసరించు నట్లు చేయుచు గవాక్ష రంధ్రములగుండ నన్నుంజూచుచుండెను. నేనును దగిన సమయము దొరకినదికదా! యని మెల్లఁగా సాగిం చితినిఁ

ఫూల్—ఏమి సాగించితివి?

జు—(చిఱునగవుతో) బోగము దానికన్న నేను మఱింగు లధి కముగా సాగించితిని.

ఫూల్—(నవ్వుచు) నీవసలు—బోగము—కాదు కాదు. దేవతల బోగము వాండ్రిలోఁ బుట్టవలసిన దానవు.

జు—అదిగో మెల్లఁగా సాగించు చున్నారే. అట్లులైన నేను జెప్పనులెండి.

ఫూల్—లేదు. చెప్పుము.

జు—మఱలఁ బరిహాస మాడుటకా?

ఫూల్—కాదు. కాదు. ఆవిషయము విన వలయు నని యున్నది.

జు—అంతట వాని పిచ్చి కే నచ్చెరువంది. యిచ్చివచ్చినరీతి నాడింపవచ్చునని యెంచి.

తే. గీ. ఇంటి నిల్లాలినిగుఱించి కే యించుకంత
మంచిచెడ్డల నడుగుచు కే మధురభావ
ణముల నతనిపైఁ దమకము కే న్నగతిఁబలికి
చిటికలోఁ గుక్కరీతిని కే జేసితి నహా!

అంత నతఁడు తటాలునఁ దాళము దీసి తలుపుఁ దెఱచి లోనికి వచ్చె ను. వచ్చినతోడనే మెల్ల మెల్లఁగా దగ్గఱఁ జేరి మైమఱపించి వానియొద్ద నున్న తాళముచెవిని సంగ్రహించి మిమ్ము విడిపించితిని.

ఫూల్—(నవ్వుచుఁ బరిహాసముగా) వహ్వా! ఎంతపనిఁ జేసి తివి? ఎంత యుక్తిఁ గనఁబఱచితివి? నీ వింత రాద్ధాంతము సేయకున్న మన మక్కడనే యుండుము కాఁబోలును?

జు—(విరసముగా) ఏమో లెండి! మీ సమర్థతముందు నబ లనగునాశక్తి యెంత? యుక్తి యెంత? మీరు తలఁచుకొన్నచోఁ గో టబురుజులైనను దాఁటఁగలరు. సముద్రములైన నఱచేతిలోనికిఁ దేఁ గలరు.

ఫూల్—అబ్బా! నీ యొద్ద నేను మాట్లాడుటకే వీలు లేదు. ఎంత చక్కఁగా మాట్లాడుచున్నను నేదో యొకసందుఁ గనిపెట్టి యెు త్తుచుందువు.

జు—సరే! ఈ హేళనల కేమి గాని యిఁక జరుగవలసిన విష యమును గూర్చి విచారించితిరా?

ఫూల్—సుందరీ! అట్లు విచారింపవలసినయవసరము నా కేమి కలదు? చూడుము.

ఉ. పెట్టినపేరు జిత్తులకుఁ బెన్నిధి యోచనలందు నెంతయుఁ
గొట్టినపిండి యుక్తులకుఁ గొండ యె ధైర్యమునందునన్ భళీ!
యట్టి ప్రతీపదర్శినుల నగ్రణివౌ నినుఁ గూర్మి మీఱఁ జే
పట్టితి నింక నేమిటను భామిని! నాకుఁ గొఱంత గల్గెడిన్,

జు—సరే! మీకేమి? ఎదురుగాఁ గూర్చుండి వాఁగెడువారున్న పక్షమున నెంతసేపైనను విసుఁగులేక వాఁగుచుందురు. ఇది సమయ ము గాదు. భోజనానంతరమున మాట్లాడవచ్చును రండి.

(ఇరువురు నిష్క్రమింతురు,)

[ తెర పడును. ]

3 వ రంగము:— హుగ్లీ నదియొద్ద.

[ బ్రాహ్మణి వేషముతో జుమీలియా ప్రవేశించును. ]

బ్రా—మమ్ములను వెదకుటకై దేవేంద్రవిజయుఁ డీ యెనిమిదిగంటలబోటులోఁ బయనమగునని గౌరిచందు చెప్పెను గదా ఇప్పటికి దాదాపుగాఁ బదునొకండుగా వచ్చినది. ప్రియాణ మే యైన యెడల నీ రెండుమైళ్ళదూరములో నింతయాలస్య మేల జరుగును? మా గౌరి పరాకుగా వినియుండునా? లేక నే నిటకు రాక ముందే! వెళ్లిపోయెనా ? ఎట్లు వెళ్ళియుండును? నే నిచ్చటికెనిమిదిగంటలు కాకమునుపే వచ్చితిని గదా! వచ్చినప్పటినుండియు వెళ్ళుచున్న సరకుల నావలను బరిశీలించి చూచుచునేయున్నాను. (నదివంకఁ జూచి) ఆ వచ్చుచున్న బోటును జూచి యది కానిచో నాదారిని నేను బోయెదను. (ఎదురు చూచుచుండి బోటు సమీపమునకు రా నీటిలో దుముకును.)

[ దేవేంద్రవిజయుఁడు పడవ నెక్కి రామ్‌జీతో ప్రవేశించును. ]

దే—(చూచి) రామ్‌జీ! బోటు నిలుపుబోటునిలుపు మిందెవ్వరో పడినట్టు లున్నది.

రామ్—అయ్యో! ఇదేదో దయ్యములాగున నున్నదండి!

బ్రా—అయ్యా! నేను దయ్యమును గాను దేవరను గాను. దిక్కులేనియొకనిర్భాగ్యురాలను.

దే—నీ కుల మేమి? ఈ యర్ధరాత్రిమ ందిట్లొంటరిగా వచ్చి యీ నదిలో దిగుటకుఁ గారణ మేమి?

బ్రా—అయ్యో! నే నొక బ్రాహ్మణిని. నా కాపద్బాంధవు లెవ్వరును లేనందున జీవితముపై విరక్తి కలిగి యీ గంగలోఁబడి చావ నిశ్చయించుకొని వచ్చితిని.

దే—అంతటియాపద నీ కేమి సంభవించినది?

బ్రా—కొంచెము దుఃఖముతో) అయ్యా! నా తల్లిదండ్రులు చిన్ననాఁడే గతించిరి. తోడునీడ లసలే లేరు. చుట్టములు మొదలే లేరు. నా భర్తగారును దిక్కు మొక్కు లేక యన్నివిధముల నన్నే పోలియున్నారు. ఎవరు లేకున్నను మే మిరువుర మింతవఱకుఁ బొర పొచ్చెము లేమియు లేక సుఖముగా నున్నారము. ఇట్లుండ నా దుర దృష్టమువలన నా భర్తగారికిఁ దీఱనివ్యాధి సంభవించి సంవత్సరము నుండియు వేధించుచున్నది. ఎంతమందిఘనవైద్యులను దీసికొనివచ్చి మందిప్పించినను నది కుదుటఁబడక నానాఁటికి వృద్ధియగుచున్నది. అన్నపానీయము లిరువదిదినములక్రిందటనే కట్టువడినవి. ఇన్నిదినము లనుండి యన్నపానాదులు లేకున్నను జూచుట కెప్పటివానివలెఁ గన్ప ట్టుచుఁ బిలిచినఁ బలుకుచుండెడివాఁడు. ఈనాఁడు సూర్యోదయము మొద లిప్పటివఱకుఁ బిలిచినఁ బలుకుటకాని యటు నిటుఁ గదలుట కాని లేదు. ఇఁక జీవింపఁడని నా కధైర్యము దోఁచి యట నొంటిగా నుంట సహింపలేక యిట్టి నికృష్టపుబ్రతుకు బ్రతుకుటకన్న నెందైనఁ బడి చచ్చుటయే మేలని తెగువఁదనమును బూని యిచ్చటికి వచ్చితిని. నాకేల యాలస్యము గలుగఁజేతురు? దయ యుంచి మీ ప్రయాణ మును మీరు సాగించుకొనుఁడు.

దే—అయ్యయ్యో! అటువంటిరోగి నొంటిగా వదలి నీ విట్లు రాఁదగునా?

బ్రా—అయ్యా! ఏమి చేయుదును? న న్నెవ్వరును బలుకరిం చువారు లేకపోవుటచే నేమియుఁ గదలకమెదలక శవమువలెఁ బడియు న్ననాభర్తను జూడ మిక్కిలి భయము గలిగినది. పిచ్చి యెక్కినట్లు న్నది. సమీపమున నిలుచుటకైనను మనసు కొల్పినదికాదు. అంత భయోద్రేకముతో నిక్కడ నుండుటకన్నఁ జావే మేలని తలంచితిని.

దే—అమ్మా! నీవు నిష్కారణముగాఁ జావవద్దు. నాకుఁ గొంచెము వైద్యమునందుఁ బ్రవీణత కలదు. నేను వచ్చి నీ భర్తయొక్క రోగము గుదిర్చెదను. ఏమనెదవు?

శారి—తండ్రీ!

చం. ఇలపయి నెంతదాఁక మని కే యింతు నెఱ యంతటిదాఁక దేవునిం
గొలిచినరీతి నిత్యమును గొల్తును మీపదకంజమాన; ని
స్తులకరుణార్ద్రదృక్కులను జూచి ననుఁ బతిభిక్ష పెట్టు మో
యలఘుగుణవ్రజోల్లసిత! యార్తజనావన! సాధువందితా!

అయ్యా! మీ కివే వందనములు. (నమస్కరించును.)

దే—(పడవ దిగి) రామ్‌జీ! నేను దిరిగి వచ్చుదనుక నీ బోటు నిచ్చటనే కట్టిపెట్టుము.

రామ్—అయ్యా! మీరు వెళ్ళవద్దు. ఇదియంతయు నరణ్యము; ఇచ్చటఁ బ్రసిద్ధిగా దారులు గొట్టుచుందురు. మి మ్మీయాడు దేదియో మోసము చేయుటకే కొనిపోవుచున్నది. మీరు నా మాట విని బోటులోనికి రండు.

శారి—అయ్యా! నే నట్టిదానను గాను. కాకున్నను దిక్కుమాలినదాని నెవ రేమియన్నను బడవలయును గదా!

దే—అమ్మా! వానితో నేమి కాని మీ యూ రెంత దూరమున నున్నది?

శారి—అయ్యా! ఎంతో దూరమున లేదు. నాలుగు ఫర్లాంగులుండియుండనట్లు కన్పట్టును.

దే—సరే! నీవు ముందు దారి తీయుము.

శారి—చిత్తము.

నిష్క్రమింతురు.

[ తెర పడును. ]

4 వ రంగము:—జీనసపాలు తోఁట.

(అందలి యింటిపంచలో నొకఁడు మంచముమీఁదఁబరుండి యుండును. దేవేంద్రవిజయుఁడును గపటబ్రాహ్మణి యగుజుమీలి యాయును బ్రవేశింతురు.)

బ్రా—అయ్యా! (వ్రేలితోఁ జూపుచు) ఆయనగారే; చేతిని జూఁడుఁడు. ఎంత తెలివిగాఁ గన్పడుచున్నాఁడో చూడుఁడు. ఇంత దూరము తమకు శ్రమకల్పించి తీసికొనివచ్చినందుకు మన్నించి శీఘ్రమే తగిన యౌషధ మిండు.

దే—ఇతఁడేనా నీ భర్త?

బ్రా—ఈయనగారే.

దే—మంచిది. (మంచముకడ కేగి చేయి చూచి) ఇదేమమ్మా? ఇతని కేకోశమందును జబ్బు కనుపించుటలేదే?

బ్రా—లేకేమి? చూడుఁడు. నే నా రోగచిహ్నము లన్నియు మొదటనే చెప్పితిని గదా!

దే—నా కేమియుఁ దోఁచుట లేదు. నాడి సరియైనస్థానమునందే యుండి మామూలుగానే నడుచుచున్నది. వాతపిత్తశ్లేష్మములు సమముగానే యున్నవి. కంటిలోఁ గూడఁ జూచెదను. దీప మిటు తెమ్ము.

బ్రా—ఏమండీ! మీ రొత్తియొత్తి చూచుచున్నారు. కొంచెము జాగ్రత్తగాఁ జూడండి. ఆయనకు మొదటనుండియు వైద్యు లన్న బహుకోపము.

దే—అట్లయిన న న్నిక్కడి కేల తీసికొనివచ్చితివి?

బ్రా—ఆవిషయము నే చెప్పెదను. తమ రొకసారి యిటు దయచేయుఁడు.

దే—ఎక్కడికి?

బాలి—భయపడెద వేల? ఇచ్చటికేనండి.

దే—(స్వ) ఏమిది? ఇతనికి రోగ మున్నట్లే తోచుట లేదు సరికదా దీనిమాట లన్నియు వేఱుగా నున్నవే! నన్నేదేని మోసము చేయుటకే యిచ్చటికిఁ దీసికొనివచ్చినదా యేమి? కానిమ్ము; వీరిరువురు నన్నేమి చేయఁగలరో చూచెదను గాక (ఆపె వెంటఁ గొంతదూరము పోయి ప్రకాశముగా) అమ్మా! చెప్పవలసిన దేదో చెప్పుము. నేను దొందరగా వెళ్ళవలసియున్నది.

బాలి—(నర్మగర్భితముగా) తమ రూరక తొందరపడెద రేల? మా యింట నొకనాఁ డుండఁగూడదా యేమి?

దే—ఉండవచ్చును; కాని నాకిప్పుడు తీఱిక లేనిసమయము.

బాలి—అయ్యో! మానవునకుఁ దీఱిక యెప్పుడు నుండదు. తీఱికగలవాని కెప్పుడును దీఱిక యే. అదంతయు మనస్స్వభావము ననుసరించి యుండును.

దే—ఔ నావిషయము నాకుఁ దెలియును.

బాలి—తెలిసియుండియు నిట్లు మాట్లాడెద రేల?

దే—నే నిప్పు డొక కార్యమును సాధించుటకై బయలుదేఱితిని. అది సక్రమముగా నెఱవేఱువఱకు క్షణ మాఁగుటకు నా మనస్సొప్పదు.

బాలి—మీరు నిర్వహింపఁబూనిన కార్యమునం దిహమా? పరమా?

దే—అ దేదియో నాకుఁ దెలియదు.

బాలి—(చిఱునగవుతో) కాదండి! ఇహసౌఖ్యమునకా? పరసౌఖ్యమునకా యని?

దే—పరసౌఖ్యమునకే.

బా౦—మీ శివాసౌఖ్యమునం దంత యిష్టము లేదా యేమి?

దే—అమ్మా!

ఉ. మాటికిమాటికీపనికి కై మాలినమాటలతోడఁ గాలముం
జేటొనరింప నౌనె యిటు కై చేసియ! నీవట నిశ్చయంబుగా
నేటను దూఁకి చత్తునని కై యెంచి దయామతితోడ రాఁగన
య్యాటల నాడనీకు మరి కై యాదగునా! తగునా? వచింపుమా!

మఱియు.

తే. గీ. భర్త కతిదీర్ఘగదము సం కై ప్రాప్తమైన
దంచు వచియించి నన్ను వం కై చించి యిటకుఁ
దోడుకొనివచ్చి మదిని సం కై తోస మొంది
కులుకుచుంటి వి దెంతటి కై కొంటెతనమొ?

బా౦—ఓహో! ఇది యన్నిటికంటె బాగుగా నున్నది. నేను మీసవిస్తారముం దెలిసికొనుటకై యడుగుచుంటిని; గాని కొంటెతనముతో మిమ్ముల నడుగుచుంటినా? ఏటి కట్లు తొందరపడి మాట్లాడెదరు? (మంచమువంకఁజూచి) అదుగో! కదలుచున్నాఁడు. విసినచో మిమ్ములను నన్నుఁ గూడఁ జంపును. ఇటు రం డొకమాట చెప్పెదను.

దే—ఇం కెక్కడికి?

బా౦—ఓహో! మీ రడుగఁ డుగున కాలోచించుచున్నారే. మీ కేమియు భయము లేదు రండు. (చూపుచు) ఆ గదిలోనికే.

దే—నా కేమి భయము? పద (ఇరువురు నిష్క్రమింతురు.)

(తెరవాలు)

ఉ. ఈపెనుదయ్యమయ్యొ! భరి కై యింపఁగఁజాలనిఘోరము మొక్కటర్ణ
నాపయి గుప్పుచున్నయది కై న న్నిటఁ బ్రోచెడువారు లేరు ల

క్ష్మాపతి! నీవు దక్కన్ నర సింహుఁడవై మును దైత్యడింభకు
న్నేపునఁ నేలినట్లు వడి నేలుము నిన్ను భజింతు నెప్పుడున్.

ఓ యార్తజనశరణ్యా!

"శా. లావొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులా
ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చెఁ, దనువుం డస్సెన్, శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపదగున్ దీనునిన్
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!

సిరాజ్—(దేవేంద్రవిజయుని బుజముమీఁద నైచుకొని పరు
గెత్తుకొని పారిపోవును) -(తెర పడును.)

చతుర్థాంకము.





శ్రీ

# అరిందమవిజయము.

## పంచమాంకము.

### 1 వ రంగము—అరిందముని యిల్లు.

(రేవతియు నరిందముఁడును బ్రవేశింతురు.)

రే—ఏమనెను? నన్ను వివాహమాడ ననెనా?

అ—అమ్మా! నే నిచ్చకములకై యట్లంటిని; గాని నే నంపిన జాబును జూచినతోడనే యతఁడు రెండుజాముల వేళ నెండ యని సంకోచింపక నాయొద్దకు వచ్చెను. నే నంతట వాని కొకపని నియోగించితిని. ఆ పని తీఱుటతోడనే మీ యిరువురకు నా యింటనే పెండ్లిచేసెదను. అంతవఱకు నీవు వానికంటఁ బడక యుండ వలయును.

రే—తండ్రీ! మీ యాజ్ఞ నుల్లంఘింతునా?

అ—సరే! దేవేంద్రవిజయుఁడు వచ్చువేళ యగుచున్నది. నీవు లోనికిఁ బొమ్ము.

రే—చిత్తము. (నిష్క్రమించును.)

అ—(వార్తాపత్రికఁ జదువుచుండ నింతలో దేవేంద్రవిజయుఁడు ప్రవేశించును.) ఓహో! దేవేంద్రవిజయుఁడుగారా! రండు రండు!!

దే—(చేరువ పీఠముపైఁ గూరుచుండును.)

అ—ఎంత భోగట్టా సంపాదించితిరి?

దే—ఏమియును దొరకలేదు.

ఆ—మీ రెక్కడ విచారించితిరి?

దే—ఒకటియే విచారణ పెద్దవిచారణ!

అ—అనఁగా?

దే—ఏమి చెప్పుదును? చెప్ప సిగ్గగుచున్నది.

అ—సిగ్గేటికి? జరిగినవిషయ మేదో చెప్పుఁడు.

దే—నేను బదిగంటలకు బోటులోఁ బయనమై పోవుచుండ మార్గమధ్యమున నొక పిశాచితటస్థమై నాకొంపఁ దీసినది.

అ—ఏమేమీ? దయ్యమా?

దే—ఔను!

అ—ఏమి చేసినది?

దే—ఏమిచేసినదని చెప్పుదును? అంతరాత్రివేళ నా మహానదీమధ్యప్రదేశమున మా బోటున కెదురుగా నిలిచియున్నది. నే నంతట బోటు నాఁపించి యెవ్వరో స్త్రీకదా యని దాని సవిస్తార మడిగితిని. అదియు మనుష్యవచనములతో "నే నొక బ్రాహ్మణిని; నా నాథునికి సంవత్సరమునుండి దీర్ఘవ్యాధి సంభవింప దానితో నవయుచుండ నయ్యది క్రిమక్రమమున వృద్ధి నొంది, నేఁడు ప్రపంచ జ్ఞప్తికూడ లేకుండునట్లు చేసెను. ఆ బాధఁ జూడఁజాలక యీ నది యందుఁ బడి చావనుద్దేశించి వచ్చితి" నని మిక్కిలి దీనవదనముతో సవినయముగా జాలికలుగునట్లు చెప్పెను; నే నంతట పరోపకార ము గదా యని యెంచి నీభర్తకేను మందిచ్చెద నంటిని. అదియు నొప్పుకొని నన్నుఁ దనవెంటఁ దీసికొని వెళ్ళినది. ఇఁక నేమి చెప్పుదును.

ఉ. తీసినదారి సొంతముగఁ దీయక వే ఱొకదారిఁ దీసి, నీ
వాస మిఁకెంతదవ్వసిన వచ్చితి మల్లదొ చూడుమంచుదా

నాసను గొల్పి యెట్లో నిల కే యంబును జేరిచి యందుఁగూ్రరతం జేసిన మోస మింత యని నే చెప్పఁగ సిగ్గగు నేమి చెప్పుదున్

అ—(నవ్వుచు) ఓహో! మీరు డాక్టరులు గదా!

దే—ఆ పేరే నా కొంపఁ దీసినది.

అ—సరే! తరువాత నేమైనది?

దే—అయ్యో! ఆ యింటిలోనికిఁ దీసికొనివెళ్ళి నన్నొకచీఁకటి గదిలోఁ బెట్టి తలుపులు బిగించి విషమిశ్రితమైన పొగ నందు వదలిన ది. ఎంత వేఁడుకోలుగాఁ బల్కినను గనికరించినది కాదు. ఇంకనా కక్కడ నెవ్వరు దిక్కు? అప్పుడు లోకైకరక్షకుఁ డగుపుండరీకాక్షుని దొల్లి మతంగజపతినుతించిన గతి నుతింపసాగితిని. తుద కూపిరి తి రుగక స్మృతితప్పి పడిపోతిని. తరువాత నేమి జరిగినదో నేనెట్లు వచ్చితినో నాకుఁ దెలియదు; కాని నాకు మెలకువవచ్చుసరికి తమ యుద్యానములోఁ బండుకొని యున్నాను.

అ—పాపము! తమ రీ వైద్యవిద్య నభ్యసించినఫల మూరకపో వునా? అయ్యయ్యో! అర్ధరాత్రియప్పు డది యెవరైన నేమి? వెను కముం దాలోచింపక య ట్లొంటిగాఁ బోఁదగునా? వెళ్లుటకెంత యో చన యుండవలయును. ఎంత సామర్థ్యముండవలయును? ఇంకొక తె యైనచో నిన్నిక్కడకు రానిచ్చునా? అది యెంత ప్రజ్ఞ గలదనుకొంటి వి? మాబోఁటి యపరాధపరిశోధకులమీఁదనే యది కత్తిగట్టి తన యావచ్ఛక్తిని జూపుచున్నది. పాపము నీబోఁటి వానిని జంపినఁ దన బిరుదుకు లోపము గలుగు నని కాఁబోలు వదలినది. లేకున్న నిన్ను మేమును మమ్ము నీవును జూఁడగలుగుభాగ్యము లేకుండెడిది.

దే—అయ్యో! అదియే జమీలియా యేమి?

అ—ఇన్ని పోల్చి చెప్పుచున్నను నింక ననుమానపడెద వేల? అదియే జమీలియా.

దే—(ఆశ్చర్యముతో) ఆహా! ఎంత మోసము చేసినది! ఎంత యుక్తిఁ గనఁబఱచినది! ఎంత నమ్మకముగ చెప్పినది! అది యిన్ని బన్నములు పెట్టుచున్నను దయ్యమేమో యనుకొంటిని; కాని జమీాలియా యని సందేహమైనను బడలేదుసుమా.

అ—అయ్యో! నీ కంతటి యూహయున్న యెడల మొదటనే దానిని బంధించియుందువు.

దే—అయ్యో! అది జమలయే యనుకొందము. నేను మీా కోఁటలోని కెట్లు వచ్చితిని?

అ—అదియే కొంచె మనుమానముగా నున్నది. ఏమున్న నేమి మనము భోజనానంతరమునఁ బయలుదేఱి వెళ్ళి,

తే. గీ. సాధ్యపడరని మదిని సంశయముపడక
కష్టమైనను మఱి యెంత నష్టమైన
నీవు గాంచినచోట నా నీచు లున్నఁ
బట్టి బంధించి కారలోఁ బెట్టవలయు.

చాలవేళమైనది రమ్ము. లోనికేగుదము.

దే—చిత్తము (ఇరువురునిష్క్రమింతురు.)

2 వ రంగము—పోలీసుస్టేషను.

(ప్రవేశించుచు యోగీంద్రనాథుఁడును, ఒకసార్జంటును ప్రవేశింతురు)

సా—అయ్యో! జమీాలియా పూల్ సాహేబు లెక్కడ నుండిరో తెలిసినదా?

యో—మన దేవేంద్రవిజయుఁడేమో కొంచెము జాడఁ దెలిసికొని వచ్చినాఁడఁట అనిమిత్తమై అరిందమబాబుగా రాయనను వెంట బెట్టుకొని యుదయము భోజనానంతరమున వెళ్ళిరఁట, వా రింకను రాలేదు.

సా — దేవేంద్రవిజయుని కెట్లు తెలిసినది?

యో — ఎట్లు తెలిసినదో; కాని యీ విషయమై కూపీ తీయుటకే రాత్రియెనిమిదిగంటలబోటులోఁ బయనమగుదునని చెప్పెను. మఱల నాకుఁ గనుపింపలేదు.

సా — అయ్యో! వీరిరువురే వెళ్లిరా? రక్షకభటుల నింక సహాయముగాఁ దీసికొనివెళ్లి రా?

యో — వా రిద్దఱే వెళ్ళిరి.

సా — అబ్బా! అరిందమబాబుగారి ధైర్యస్థైర్యములు వర్ణనాతీతములు. ఆ హంతకు లొనరించెడుదారుణ కృత్యములకు మఱొకరైనచో నెప్పుడో గుండె బ్రద్దలై చచ్చెడివారు. చచ్చుట యెట్లున్నను ముం దీ దేశము నే వదలి పాఱిపోయెడివారు. ఆహా! యుక్తులలోఁ బట్టుదలలోఁ గార్యసాధనసామర్థ్యములో నరిందమ బాబుగారిని జెప్పి మఱొకరిని జెప్పుటకు వీలు లేదు.

యో — ఔ నౌను! ఆయనస్వభావమే వేఱు. శుభము గలిగినపుడు సంతోషింపఁడు కష్టమువచ్చినపుడు విచారపడఁడు. ఎప్పుడును బరోపకారార్థమే తనయావచ్ఛక్తిని ధారపోయుచుండును. ఆకారణమువలననే మనతోడివారలలో మిక్కిలి కీర్తనీయుఁ డయ్యెను. (ఎవ్వరో వచ్చుచుండుటఁ జూచి) ఆవచ్చెడివారెవ్వరో?

సా — డిటెక్టివుగారే.

(అరిందముఁడును, దేవేంద్రవిజయుఁడును, సిరాజ్ హీన్ను, ప్రవేశింతురు.)

యో — అయ్యా! దయచేయుఁడు. ఇంతకుముందు మీవిషయమునే చెప్పుకొనుచున్నాము. మీకు నిందు నూఱేండ్లాయుర్దాయము.

అ — ఆయుర్దాయముండుటవలననే ఆముండచేతిలోఁ బడి తప్పించుకొని రాఁగలిగినది.

మో.—ఈయనగా రెవ్వరు?

అ.—దేవేంద్రవిజయుని నన్నును గాపాడిన ప్రాణదాత.

మో.—అనఁగా నా కర్థ మగుటలేదు.

అ.—తెలిసికొనుము. నేను దేవేంద్రవిజయునివలన జుమలా ఫూల్ సాహేబు లా జీవనపాల్ తోఁటలో నుండిరని తెలిసికొని యుదయము పదిగంటల కాయననే వెంటఁబెట్టుకొని యచ్చటి కరిగి యందున్న యొకయింటిలోఁ బ్రవేశించితిమి. అబ్బా! ఆయింటి మహాత్మ్య మే మని వర్ణింతును! అంతియుఁ గృత్రిమమే. అన్నియు వాకిళ్లే, భూతలము నుండి రసాతలమువఱకు నన్నియు గదులే. ఒకచోట నొక్కినఁ దలుపులన్నియు మూయఁబడును. మఱొకచోట నొక్కిన నన్నియుఁ దెఱవఁబడును. అట్టి భయంకర గృహములోఁ బ్రవేశించినతోడనే ఫూల్ సాహేబు నెదుర్కొని వానితోఁ గొంతసేపు హోరాహోరిగాఁ బోరి తుదకు వాఁడు నాకు గ్రుచ్చఁబోవుచున్న విషపుసూదులను నే నెత్తిట్లో గుంజుకొని వాని ముక్కుమీఁదను మొగముమీఁదను బొడిచితిని. వాఁ డా విష మెక్కుటతోడనే స్మృహ దప్పి పడ వానికాలుసేతులకు సంకెలలు దగిలించి యందున్న యొకమంచపుఁగోటికిఁ గట్టివైచి వెనుకకు మఱలుదును గదా (దేవేంద్రవిజయుని జూపుచు) ఈయన కనుపింపలేదు.

మో.—(దేవేంద్రవిజయునితో) మొదట మీ రిరువురుఁ గలసి వెళ్లితిరి గదా! మీ రెచ్చట నుంటిరి?

దే.—ఎచ్చట నుంటినో చెప్పెదను వినుఁడు. ఆ యింటిలో మేము ప్రవేశించునపు డరిందమబాబుగారు ముందును నేను వెనుకను బోవుచుంటిమి. అ దేమి చిత్రమో కాని నాటకములోఁ దెర వదలిన మాడ్కి మా యిరువురిమధ్య నొకవాకిలి తటాలున మూయఁబడినది. ఆయనగా రేమైరో నేనుమాత్రము జమీలియాతోఁ బోరాడుచుంటిని.

యో—తుద కేమైనది?

అ—ఏమైనదా? మన దేవేంద్రవిజయుని దుర్గంధయుతమైన యొకగోతిలోఁ బడఁద్రోసినది. నే నెక్కడ వెదకినను గనుపింపలేదు. చివఱ కొకగదిలో మూల్గుచున్నట్లు ధ్వని నా చెవిని బడినది. అంతట నే నక్కడికి వెళ్లి చూతును గదా గొంతుకపఱకు రొంపిలోఁ గూరుకొనిపోయి యుచ్ఛ్వాసనిశ్వాసము లాడక మిక్కిలి బాధపడుచుండెను. బయటికి లాగుదమన్న మూరెఁడు త్రాడైనను దొరకలేదు. వెంట నే నా యుత్తరీయ మందులోనికి విడిచి కొంచెము కొంచెముగాఁ బైకి లాగుచుంటిని. ఇంతలో నా మహామారి యెఱ్ఱనిరంగుగలద్రావకముచే నింపఁబడినయొకసీసాను గొని తెచ్చి నాపైఁ జల్లెదనని చూపుచు నొక బొట్టు (కోటును జూపి) నిచ్చట వేసినది. నేను జచ్చిన నొప్పుకొంటిని గాని నన్ను నమ్మి నాకు సాయపడవచ్చినదేవేంద్రవిజయుని బ్రతికింపవలయు నని నే నట్లే లాగుచుంటిని. తుద కది సీసా నొక్కసారిగాఁ గుమ్మరింప నుద్యమించెను. ఇంతలో (సిరాజ్‌హీన్‌ను జూపుచు) ఈ మహానుభావుఁ డొకగదిలో నుండి బయటికి వచ్చి మాపైఁ జల్లనున్న జుమీలియాచేతిలోనిసీసాను లాగి కొని యంతయు దానిమీఁదనే పోసెను. అది యా బాధ కోర్వలేక లోని కేగినది. నే నీ లోపల దేవేంద్రవిజయుని బైకి లాగితిని. ముగ్వురమును గలిసి వాండ్రకై వెదకఁగా నెచ్చటను గనుపింపలేదు. ఏమైరో తెలియలేదు. అంత బయలుదేఱి యిక్కడికి వచ్చుసరి కీ వేళ యైనది.

యో—అబ్బబ్బా! ఎన్నిచిక్కులు పడితిరి!

అ—ఎన్ని చిక్కు లేమిటి? మే మనుభవించిన వన్నియుఁ జెప్పినచో నొక దినమైనఁ జాలదు.

యో—సరే (సిరాజ్‌హీన్‌ని జూపుచు) ఈయనగా రెవరైనది చెప్పకపోతిరి.

అ—ఈయనగారా? గుల్‌సుమ్ మానసబద్ధుఁడు.

మో—ఓహో! సిరాజ్‌హీనా?

అ—ఔను!

ర-భ—(ప్రవేశించి) అయ్యా! ఎవరో యొకస్త్రీ అరిందమబా బుగారితో మాటలాడవలయు నని వాకిట వేచియున్నది, ఏ మనెదరు?

దే—(భయముతో) జమిాలియా కాదు గదా?

అ—ఎవరైననేమి రమ్మనుము.

ర—చిత్తము.

(నిష్క్రమించును.)

(మోహిని ప్రవేశించును.)

మో—అయ్యా! నేను జమాలియాను గాను. మీరు నాయం దేమియు ననుమానపడవద్దు. నేను మిమ్ము వేధించుచున్న తఱుసలిగాని మొదటిభార్యను. నన్నతఁడు మోసముచేసి నా పుట్టింటివారిచ్చిన యాస్తినంతయుఁ దనవశము చేసికొని నను నిలువెడలఁగొట్టి జమిాలి యాను జేపట్టెను. అప్పటినుండియు నే నెట్లేని వానింజంపి నేను బ్రా డుచుకొని చావవలయు నని యెంచి యహోరాత్రములు సమయ ముకొఱకు నిరీక్షించుచున్నాను. ఇప్పుడు మీరు వచ్చినవెనుక దోఁపిడి గాండ్రెల్లరును సభచేసి యందు మీా యిల్లు కొల్లపెట్టుటయే కాక యీా రాత్రి మిమ్ము హత్యచేయవలయుననికూడఁ గత్తులు పట్టుకొని ప్రమాణములు చేసినారు. నే నీ విషయమును జాటుననుండి విని తమ కెఱుకసేయుటకై వచ్చితిని. వారు చాలమంది వత్తురు. మీా రెట్లు జా గ్రత్తపడెదరో యీా లోపల నాలోచించుకొండు.

అ—నీకిప్పుడు వాసస్థల మెక్కడ?

మో—అయ్యా! ఎక్కడ నని చెప్పుదును? నా కొకయిల్లుగా ని వాకిలిగాని లేదు. నేను రాత్రి యనక పగలనక, యెండ యనక

వానయనక గాలియనక ధూళియనక విసుగులేక యెప్పుడును వానివె
న్నంటి తిరుగుచునే యుందును. మఱియును.

చం. తినుటకుఁ గూడుఁ గట్టుటకుఁ గె దిన్నని బట్టయు లేక పోయినన్
మనమునఁ గుందఁబోక యభిమానము వీడి పగ న్వహించి నే
ననిశము వానిఁజంప సమయంబునకై యిటు చూచుచుంటి నో
యనఘచరిత్ర! నాకు నిలకెయంబొకచోఁ గలదే? తలంపఁగన్.

అయ్యా! వచ్చి తడవైనది నేనిచ్చట నాలసించినచో మఱల
నేమి మార్పులు గలుగునో సెలవిప్పింపుఁడు వెళ్లెదను.

అ—సరే! వెళ్లుము.

మో—చిత్తము.

(నిష్క్రమించును.)

యో—అయ్యా! మన మీ రేయి గడపుట యెట్లు?

అ—మీ రేమియు భయమందవద్దు నేనింటికేగి భోజనము
సేసి వచ్చులోపలఁ బది విద్యుద్యంత్రములును, బదిజతల బేడీలును
నిచ్చి పదిమందిరక్షకభటులను సిద్ధముగా నుంచుఁడు తరువాతవిషయ
ము నేనాలోచించుకొందును.

యో—తమరు జాగ్రత్తగాఁ బని సేయవలయును.

అ—మంచిది (దేవేంద్రవిజయ సిరాజ్‌హీనులనుజూచి) రండు
వెళ్లుదము.

(ముగ్గురు నిష్క్రమింతురు.)

యో—మనము వారు సెప్పిన పరికరములను సిద్ధముచేయుదము రమ్ము
సా—చిత్తము.

(నిష్క్రమింతురు)

(తెరపడును.)

3 వ రంగము అరిందమునిమేడ.

(అరిందముఁడును దేవేంద్రవిజయుఁడును బ్రవేశింతురు.)

అ—మిత్రమా! దొంగపిడికాండ్రు వచ్చెడివేళ యైనది. నీవు మాత్రము బహు జాగ్రత్తగాఁ గనిపెట్టుచు.

తే. గీ. దుష్టు లిటఁ గాల్లు పెట్టుట కై తోనె నాకు
నెఱుక సేయుము కాసింత కై యేనిఁ దడవు
సేసితివ మన మిప్పుడు కై చేసినట్టి
యత్న మంతయు నిష్ఫలం కై బోను నిజము.

దే—అయ్యా! ఇవి గట్టిగాఁ బనిసేయఁగలవా ?

అ—నీ వా మెట్లపై నించుక నిలువఁబడి చూడుము. నేను వెళ్లి స్టీమెక్కించెదను. పనిసేయఁగలవో లేవో చూతము.

దే—మీరు నే నాఁపుఁ డనుటతోడనే యాఁపెదరా?

అ—ఆఁపక నిన్నుఁ గష్టపెట్టెదనా?

దే—సరే! వెళ్లుఁడు. (క్రిందిమెట్లపై నిలువఁబడును.)

అ—(మేడలోనికి వెళ్లును)

దే—(బాధ నభినయించుచుఁ ద్వరగా) ఏమండో! తగ్గింపుడు! తగ్గింపుడు!!

అ—(నవ్వుచు బయటికివచ్చి) ఊరకే గోల చేయుచున్నా వే మయ్యా?

దే—అబ్బా! నిముసమైనఁ గాలేదు చంపివేసినవండి

అ—సరే! ఇఁక రమ్ము.

(ఇరువురు లోని కేగుదురు.)

(దొంగలు ప్రవేశించి వడివడిగాఁ గొన్ని మెట్లెక్కి యందలు దుఃఖముతో ఫూల్‌సాహేబువంకఁ జూతురు)

1 దొం—బాబూ! నన్నేవో లాగుచున్నవి.

2 దొం—తండ్రీ! న న్నేవో కఱచుచున్నవి.

3 దొం—నాయనా! న న్నేవో చుట్టుకొని బాధించుచున్నవి.

4 దొం—అయ్యయ్యో! నే నీ తాపమునకు నిలువలేను.

5 దొం—భగవంతుఁడా! నే నీకష్టముల భరింపలేను.

6 దొం—అబ్బబ్బా! నా నరము లన్నియు నొకచోటికిఁ దోడు
కొని పోవుచున్నవి.

7 దొం—అయ్యో! నన్నీతాఁచు పాములు చంపివేసినవి.

8 దొం—కట్టా! నా శరీర మంతయుఁ జిఱుచెమటలు పోయు
చున్నవి. నే నిఁక జీవింపను.

9 దొం—అక్కటా! నా యవయవములు వశము గాకున్నవి.

ఫూల్—(గుడ్లనీరు గుడ్లఁ గుక్కుకొనుచుండును.)

(బేడీలు తీసికొని పదిమందిరక్షకభటులును, అరిందముఁడును,
దేవేంద్రవిజయుఁడును బ్రవేశింతురు.)

దే—బాబూ! బేడీలు తగిలింపుమందురా?

అ—వద్దు! వద్దు!! డాక్టరుగారితోఁ గొంచెము మాట్లాడినవె
నుకఁ దగిలింపవచ్చును.

దే—చిత్తము:

అ—(అపహాస్యముగా) బిస్మిల్లా! కాదు. కాదు. కేశవజీ! ఇదియును
గాదు డాక్టర్ ఫూల్సాహేబ్ జీ! సలాం (సలాం చేయును.)

ఫూల్—(మాటలాడక రౌద్రాకారముతోఁ జూచుచుండును)

అ—(నవ్వుచు)మీకును మీ జుమల-కాదు కాదు. మోతి
బీబీకిని క్షేమమా ?

ఫూల్—(ఊరకుండును)

అ—ఆహా! తమ రిన్నినాళ్ళకు మా యింటికి దయచేయుట మా కెంతయు హర్షదాయకము గదా !

పూల్—(మిన్నకుండును)

దొంగలు—(మిక్కిలి దుఃఖముతో) అయ్యా! అయ్యా! చెఱసాలలోఁ బెట్టినను సరియే. ముందు మాకీ బాధ తప్పింపుఁడు. లేదా ఈ పడి యున్నకత్తులతో మా కుత్తుకల నుత్తరింపుఁడు.

అ—ఏదీ వీరికి మాత్రము బాధగా నున్నది; కాని పూల్ సాహేబుగారి కేమియు ఫవర్ చాలనట్లుగాఁ దోచుచున్నది.

పూల్—(శోకాయత్తమగు కోపముతో) ఓరీ! అరిందముఁడా! మాటిమాటికి యెగతాళిసేయుచు నేటి కదరిపడెదవు? సింహము బోనునఁ బడినదనియా? ఇదియేనా నీ పరాక్రమము?

అ—నా పరాక్రమమున కేమి; కాని నే నడుగుప్రశ్నలకు జవాబు లొసంగెదవా? లేదా?

పూల్—అడుగుము. నీ వలెఁ జెప్పకుండుట కే నంత పిఱికి పందను గాను.

అ—మంచిది. చెప్పుము.

తే. గీ. వెలఁది మోహినిఁ బెండ్లియై • వేడ్క దాని
పుట్టినింటివారిచ్చిన • యట్టిధనము
గుంజుకొని యిల్లు వెడలంగఁ • గొట్టె నెవఁడు
మొదటఁ జెప్పుము శీఘ్రమే • మూఢ !—

పూల్— నేనె.

అ—దీనికిఁ జెప్పుము.

కం. జమలను దమిజుద్దీన్ కడఁ
బ్రమదంబున గడనకత్తె • భంగి నునిచి వి
త్తము దోఁచుకొనుట కాక వి
షము నిడి చంపె నెవఁ డతని • జడుఁడా !

ఫూల్___ నేనె.

అ___తే. గీ. బాలయని సూంతమైనను ౯ జాలిలేక
రోహిణిని జంపి తాణాకు ౯ రూఢి మెఱయఁ
బంపి పిమ్మటఁ గమ్మలో ౯ వ్రాసె నెవఁడు
చంపుడు నరిందము నని వా ౯ చాట!___

ఫూల్___ నేనె.

అ___ఇంక నడుగవలసినవిషయము లనేకములు గలవు. వాని నెప్పుడో తీఱికమీఁద నడిగెదను. ఇప్పు డింకొకప్రశ్నకు మాత్రము జవాబు చెప్పుము.

ఫూల్___అడుగుము.

అ___ఇప్పుడు నా చేతిలోఁ జిక్కి కంట నీరు గార్చుచు. బండ్లి గిలించుచున్న వాఁ డెవఁడు ?

ఫూల్___ఓరీ! పిఱికిపందా! నే నెక్కఁడను జిక్కితి నని మిక్కిలి నిక్కి పడుచున్నావు. చీ! చీ! నేను నీకుఁ జిక్కితినా? విద్యుచ్ఛక్తికిఁ జిక్కితినా? జాగ్రత్త. యుక్తులలో నన్ను మించి నిన్నేడిపించుటకై యింతవరకు నాకు సహాయపడినమహాశక్తి జుమీాలియా యున్నదిసుమా! దానిబొందిలో నూపిరి యుండువఱకు నిన్ను వేధింపక మానదు. ఇంతటితో సంతోషపడకుము.

దే___(అరిందమునితో) అయ్యా! ఏటి కీ యాలస్యము ?

అ___ఇదిగో! ఈ యదునాథగోస్వామిగారితోడను, నీ గారి చంద్ గారితోడను జెఱియొకమాట మాట్లాడనీయుఁడు ఎఱిఁగినవారిని బలుకరింపకున్నఁ గోపము వచ్చును.

గా. గో—(దుఃఖముతో) అయ్యా! మీ కొక దండము. మమ్ములను జంపివేయుఁడు.

అ—(రక్షకభటులవంకఁ జూచి) ఇఁక సంకెలలు వేయుఁడు.

ర. భ—(అందఱును బాధింతురు. అరిందముఁడు లోని కేగి విద్యుచ్ఛక్తిని దగ్గించి వచ్చును. అందఱును గలసి నిష్క్రమింతురు.)

(తెర పడును.)

పంచమాంకము.





శ్రీ

# అరిందమ విజయము.

## షష్ఠాంకము.

(జయసేనుఁ డనునొకపౌరుఁడును, విజయసేనుఁ డనునొకరక్షకభటుఁ డును జెటియొకవైపుగాఁ బ్రివేశింతురు)

జ—ఓహెూ! విజయసేనుఁడుగారా! క్షేమమా? తమదర్శన మీ మధ్య నెప్పుడును లేదు. ఎచ్చటికైనను వెళ్లినారా యేమి?

వి—ఔనుబాబూ! ఈ మధ్య నాకుఁ గొంచెము శరీరము జబ్బు చేసినది. ఆకారణమున నొక నెల సెలవు దీసికొని మాయూరు వెళ్లి నిన్ననే వచ్చితిని. మీ రెల్లరు క్షేమముగా నున్నారు గదా!

జ—ఆ! మీ దయవలన క్షేమమే. నాకుఁ జక్కఁగా బోధపడలేదు. రాత్రి పోలీసుస్టేషనుదగ్గఱ జరిగినకలకల మేమండి?

వి—కలకలమా? పూల్ సాహేబనువాఁడు డిదివఱకుఁ జెఱసాలలోఁ బడి తప్పించుకొని పోయినవిషయ మెఱుఁగుదురా?

జ—ఆ! ఎఱుఁగుదును.

వి—అతఁడు కొంతమందిజట్టులో బయలుదేఱి వచ్చి రాత్రి యరిందమబాబుగారియింటిలో దోఁపిడి వేయుటకై ప్రివేశించినాఁడఁట. అరిందమబా బిదివఱకే కొంచెము సడికట్టియుండి యింటనిండ విద్యు

ద్యంత్రము లమర్చి వాని సహాయమువలన వాండ్రినందఱను బట్టు కొనెను.

జ—అప్పు డేనో జుమీలియా యను వాఁడుదాని సాహాయ్య మున వాఁడు తప్పించుకొనిపోయెనని చెప్పుకొనిరి. ఆ జుమీలియా యున్నదా ?

వి—అది మాత్రము లేదు; కాని మగవాఁ డున్నాఁడు.

జ—వాని కేమి శిక్ష వేసితిరి ? ఉరియా? ద్వీపాంతవాసమా?

వి—ఒకటియే శిక్ష. పెద్దశిక్ష. వానిని జెఱసాలయొద్దకుఁ దీసి కొనిపోవుచుండఁగా వాఁ డెప్పుడో వదలిపెట్టినభార్య మోహినియఁట. అది యెచ్చటనుండి వచ్చెనో కాని పోవుచున్న గుంపులోనికిఁ ద్వరత్వర గాఁ బ్రవేశించి తనచేతనున్నకత్తితో నా ఫూల్ సాహేబును నఱకి తానుగూడఁ బొడుచుకొని చచ్చినది. ఆఁపవలె నని డిటెక్టివ్ గారితో సహా ప్రయత్నించితిమి; కాని సాధ్యపడలేదు.

జ—ఓహో! ఎంతసాహసము చేసినది! కనుక నే పెద్దలు-

శ్లో॥ స్త్రీణాంద్విగుణఆహారో
బుద్ధిశ్చాపి చతుర్గుణం
సాహసం షడ్గుణం చైవ
కామంచాష్టగుణం భవేత్ ॥

అని చెప్పుదురు. అబ్బబ్బా! ఈ నెలలో మన డివిజనులో జరిగిన యల్లరులు నరెస్టులు నిన్ని యన్ని యని చెప్పుటకు వీలుగాకున్నదండి!

వి—అయ్యో ! ఈ దినమున నింకొక విశేషము.

జ—ఏమి విశేషము ?

వి—నిన్న ఆ ఫూల్ సాహేబు జేబులో రెం డుత్తరములుదొ రకినవఁట. ఆ యుత్తరములలో బేనిమాద్ పురపు ప్రస్తుతపుజమీందా రుగా రేమో యన్నగారియాస్తి నపహరింపవలయు నని తలంచియా

యన్నగారి కిద్దఱుకూఁతుం డ్రుండఁగా వారిని జంపించుటకై యీదొం గలతో స్నేహము చేసెనఁట. అను విషయ ముండఁగా నతనిని గూడ నరెస్టుచేయుటకై యరిందమబాబుగారును మఱికొందఱును బేనిమాద్ పురమున కుదయముననే వెళ్లిరి.

జ—ఓహో! గోపాల్‌చందా? జాలియైనను లేక యెంత పనికిఁ గడంగినాఁడండి!

వి—ఇప్పుడు డబ్బు కాదండి యే గడ్డినైనను దినిపించును.

జ—ఔను! తమ రిప్పు డెచ్చటికి వెళ్ళుచుండిరి?

వి—ఆవైపునకే వచ్చెదను. పదండి (ఇరువురు నిష్క్రమింతురు)

విష్కంభము.

1 రంగము—గోపాల్‌చందు—ఇల్లు.

[గోపాలచందు వారియెస్టేట్లతాలూకు తాణేదారును బ్రవేశింతురు]

గో—అయ్యా! మా యన్నగారి యెస్టేట్లతాలూకు చిరాసామ్మంతయు ఝూడాగా వసూలైనదా?

తా— కాలేదు. ఇంక రెండుమూఁడూళ్లలోఁ గొంచెము కొంచెము చిలుకులు నిలువయున్నవి.

గో—ఏయేయూళ్లలో వసూలు కావలసియున్నది?

తా—హుసేనుబాద్, విఠల్‌పురము, శ్రీరామ్‌నగరులలో వసూలు కావలసియున్నది.

గో—మనప్రసాద్‌బోస్‌గారే యూరిలో వసూలు చేయుచున్నారు?

తా—శ్రీరామ్‌నగరు వెళ్ళుమంటిరిగా?

గో—వెళ్లెనా?

తా—ఆ! మొన్నమొన్ననే వెళ్లి శ్రీరామ్‌నగరులోఁ జాలభా

గము వసూలుచేసినాఁడఁట. రేపో మాపో హయిదరాబాద్ వెళ్ళుచు న్నానని యుత్తరము వ్రాసినాఁడు.

గో—సరే! మనయెస్టేటుతాలూకు లెక్కలన్నియుఁ దయా రైనవా?

తా—ఇంకను గాలేదు. నిన్నటినుండియు ఝుడితీ చేయుచు న్నాము. రేపటికిఁ దయారగును.

గో—మనగ్రామము తాలూకు వసూ లెంత కావలయును?

తా—దాధాపు నాలుగు వేలుండును.

గో—ఏమీ? నాలుగుఁ వేలే? అందఱు మీవారనియా యేమి యింత జాగుసేయుట.

తా—కాదండి! ఈ మధ్య లెక్కలహడావిడిలో వసూలు చేయుటకుఁ దీఱలేదు. రేపటితో నీపని కాఁగానే వసూలు మొదలు పెట్టెదము.

[దేవేంద్రవిజయుఁడును, అరిందముఁడును బ్రవేశింతురు]

గో—ఎవరువారు? ఓహో! దేవేంద్రవిజయుఁడుగారా? [కొంచె మెదురేగి తీసికొనివచ్చి] అయ్యా! తమ రిరువురు నిట దయ చేయుఁడు [చెఱియొకపీఠమును జూపును]

అ. దే—[కూర్చుందురు]

గో—[దేవేంద్రవిజయునితో] అయ్యా! క్షేమమా?

దే—ఆ! మీదయవల్ల మాకు క్షేమమే. మీకు క్షేమమా?

గో—అయ్యా! మా క్షేమములు మీ రెఱుఁగనివా? [కొం చెము దుఃఖముతో]

చ. తనయల చిన్ననాఁడె తలిదండ్రులు దైవపథంబుఁ జేర నా
యనుఁగుఁగుమార్తెలట్లు నిసు వంతయు భేదములేక ప్రేముడిఁ
బెనుచుచునుంటిఁ గన్నులకు పెట్టి నిరంతర మట్టిమాఁతు లె
వ్వనివశమైరొ యెట్టిదుర వస్థను బొందుచునుండిరో కటా!

దే—పాపము! తమరు నమ్మి సేవింపుచున్నందుల కీ విషయమున భగవంతుఁడు యన్యాయమును జేసెను.

అ—అయ్యో! ఈయనగారేనా దైవభక్తిపరులని చెప్పితిరి?

దే—ఈయనగారే. వీరు మొదటినుండియు ననఁగా వీరితాత ముత్తాతలనాఁటినుండియుఁ జాల వాసిగలవారు. అందునను వీరిమనస్సే వేఱు.

అ—ఓహో! దైవ మిట్టిభక్తవరేణ్యులకే కష్టములు గలుగఁజేయుచున్నాఁడా?

గో—(దేవేంద్రవిజయునితో) అయ్యా! తమ రెందైనను విచారించుచున్నారా?

దే—విచారించుచునేయున్నాను; కాని సార్థకపడుట లేదు.

గో—కొంచెమైనను జాడ తెలియలేదా?

దే—లేదు! లేదు!!

గో—మఱి మాకేమిగతి? ఆస వదలుకొనుటయేనా?

దే—వదలుకొనుట యేల? తగిన డిటెక్టివును బెట్టి చూడుడు.

గో—తగినడిటెక్టివులు మనవైపునఁగలరా?

దే—లేకేమి? (అరిందముని జూపుచు) అపరాధపరిశోధకులలో వీరు మిక్కిలి కీర్తిని గడించి మొన్నమొన్నే మనకలకత్తాకు దయచేసిరి. వీరు చాల సమర్థతగలవారు. జుఱుకుగాను బనిసేయుదురు. మీరు డిటెక్టివును బెట్టుకొనఁదలచినచో వీరినే పెట్టుకొనుఁడు నేను మీకొఱకు వీరిని బనిమాలఁదీసికొనివచ్చితిని.

గో—అయ్యా! నాకింక సందేహమా? మీ కిష్టమైనచో నాకు నిష్టమే.

దే—సరే! వీరి కే మిచ్చెదరు?

గో—అదియును మీరే చెప్పుఁడు.

దే—[అరిందమునితో] బాబూ! మీ కిందు మామూళ్ళున్నవా? లేక మీయిష్టముననుసరించి పోవుచుందురా?

అ—మామూళ్లేమియును లేవు.

ఉ. చేసినమేలుఁ గూర్చి తమ చిత్తములందుఁ దలంచి యెందఱో
చేసిరి వేలసంఖ్యగ వి శేషధనంబు బహూకృతుల్ మహో
ల్లాసముతోడ నల్లె తమ లాభము నెంచి మదీయకష్టమున్
వీసము గాంచి దానఁ దగు విత్తమొసంగుఁడు చెప్పనేటికిన్.

దే—అయ్యా! అట్లనకుఁడు "ఆహారే వ్యవహారేచ త్యక్తలజ్జా సుఖీ భవేత్" అన్నారు. ఏమనెదరు? ఈయనగారేమో కొండ త్రవ్వి నెత్తిమీఁదఁ బెట్టునని మీకుండును. ఏదో కొంచె మిచ్చి లేదనిపించిన నొప్పుకొనకుండునా యని ఆయనగారి కుండును. తుట్టతుద కొకరికొకరికి మతికుదురనందున వైషమ్యములు గలుగుటకుఁ గారణ మగును.

గో—ఔను! వారు చెప్పినది వాస్తవమే. కనుక మీ రిప్పుడే సెలవిండు. అంత్యనిష్ఠూరముకన్న నాదినిష్ఠూరమే మేలు.

అ—అట్లయిన నిద్దఱికిఁ జెఱియొక వేయివంతున రెండువేల రూపాయ లిప్పింపుఁడు.

గో—అబ్బో! ఒక్కసారియే కొండనెత్తిమీఁదఁ బెట్టినారే.

అ—ఏమండి! మీరు పెద్దజమీందారులే. యింత చిన్నమాట మాట్లాడుచున్నారేల?

గో—ఏమి పెద్దలెండి! మా జమీందారి యంతయు నూరు గొప్ప పేరు తిప్ప యను నట్లున్నది.

అ—ఓహో! నాకిచ్చుదానిలోనే బేరము లాడుచున్నారే. సంవత్సరమునకు మీవిషయ మటుంచుఁడు. మీయన్నగారికి రెండు లక్షలరూపాయ లాదాయము వచ్చుచున్నదే. ఆపిల్లలు దొరకని యెడల నిదంతయు నేగంగలోఁ బోసెదరు?

దే__అరిందమబాబుగారూ! ఈ మాటలకేమి; కాని వారేదియో కోరినారు. కనుకఁ గొంతలోఁ గొంతమాట యనుఁడు. వారికోరిక యీడేఱినచోఁ జెఱి పదివే లిరువది వేలైనను వ్యయము చేయఁగలఁడు.

అ__అదేదియో మీరే చెప్పుఁడు.

దే__నేను జెప్పిన మీరిష్టపడుదురు. మఱిరాజాగారో?

గో__అయ్యా! నాయభ్యంతర మేనియు లేదు. మీయిష్టము చొప్పున నేను నడుచుకొందును.

దే__అట్లయినచో వినుఁడు. ఇద్దఱికిని మొత్తము మీఁదఁ బదియేనువంద లిచ్చునిర్ణయము. ఇద్ద ఱొకసారియే దొరకినయెడల సొమ్మంతయు నొక్కసారియే చెల్లించుటయు ముందొకరివెనుక మఱియొకరు దొరకినయెడల మొదటిది దొరకినతోడనే యైదువందలును, రెండవది దొరకినవెనుక వేయిరూప్యములును నిచ్చుట న్యాయమని నాకుఁ దోఁచినది. పిమ్మట మీ యిష్టము.

గో__నా యభీష్ట మట్లే యున్నది.

అ__మొదటిది దొరకినతోడనే సగ మేల యీయరాదు.

దే__మొదటిది దొరకినతోడనే సగముసొమ్ము తీసికొని రెండవదానికిఁ బ్రియత్నము చేయరేమో యని-

అ__మంచియాలోచన యేపన్నితిర. అట్టియసమర్థత యున్నచో నేనాపనికిఁ గడంగనని మీకుఁ దెలియదా యేమి?

దే__నాకుఁ దెలియు ననుకొనుఁడు. వారి కిప్పుడు మీరు క్రొత్త కాదా యేమి? మీ లోతు వారికి వారిలోతు మీకును దెలిసినపుడు మధ్య నే నవసరమే లేదు.

అ__తమమాటఁ ద్రోసివేయలేను; కాని యీ విషయము కొంచెము లిఖితరూపముగా నున్న మంచిది.

గో—ఆ యభ్యంతర మేమియును లేదు. ఇప్పుడు వ్రాసి యి మ్మనిన నిప్పుడే వ్రాసి యిచ్చెదను.

అ—మంచిది. వ్రాసి యిండు.

గో—(ఒక కాగితముమీద వ్రాసి దస్కతు చేసి యిచ్చును.)

అ—(అదికొని తన జేబులోని యుత్తరమును దీసి సంతకము లు సరిచూచుచుండును.)

గో—అయ్యా! ఏ మట్లు పరిశీలించుచున్నారు?

అ—ఇది యొక యుత్తరములెండు.

గో—దానికిని దీనికిని సంబాధ మెట్లు?

అ—ఎట్లో! ఈ రెండు సంతకములను జూడుడు (ఇచ్చును.)

గో—(పుచ్చుకొని చూచి గడగడ వడఁకుచు) అయ్యయ్యో! ఇదేమి యన్యాయము. భగవాన్ - భగవాన్ - ఇదేదో ఫోర్జరీ గా నున్నది.

అ—(ఇంకొకయుత్తరమును దీసి) సరే! ఈ యుత్తరమును జూడుము (ఇచ్చును.)

గో—(చూచి) హా రేరామ! హా రేరామ! ఇదేమి పాపము? రెండును ఫోర్జరీలేనే.

అ—ఆఁ! ఏమీ? రెండును ఫోర్జరీలా?

గో—సందేహము లేదు. ఇవి రెండును ఫోర్జరీలే (హరి నుద్దేశించి) రాధాకృష్ణ! రాధాకృష్ణ! ఎట్టి నిందఁ బైనిఁ బెట్టితివి?

అ—నిజముగా నీ సంతకములు గావా?

గో—రామరామ! నావి కావండీ! అయ్యో! నే నిట్లుచేసెదనా?

అ—ఔను! మీ రట్లు చేయవలసినవారు కారు. ఏలయనఁ గా హరిదాసులు గనుక.

గో—వాసుదేవా! వాసుదేవా! పాపము శమింపఁజేయుము.

అ—అబ్బో! మీ భక్తి వర్ణనాతీతము. మీరి తాపత్రియ

ములోఁ బడియుండుట నాకు విషాదకరము. కనుక మీరు నా వెంట రండు.

గో—ఎక్కడికి రమ్మనెదరు?

అ.—విశ్రాంతిప్రదేశమునకు.

గో—ఆ వసతి యెక్కడ?

అ—కారాగృహములో

గో.—(దీనవదనముతో) బాబూ! శ్రీనివాసుఁడు సాక్షిగా నే నేమియు నెఱుఁగను. కటాక్షించి మీరు నిజమును గ్రహింపుఁడు.

అ—ఓరీ! ద్రోహీ! నీ నక్కవినయములును గుక్కబత్తియును నా కడనా?

మ. కుమతీ! కొంకును జంకు లేక యిటులం తే గ్రూరుండవై నవ్వులొ
 ల్కు మొగంబుల్ గలచిన్నబిడ్డలను నీ కే కర్మ హత్యచేయింప నే
 రము లేమేమి యొనర్చి రందునను నీ కే పాపంబు లెట్లొప్పెఁ జీ!
 క్షమియింపందగునా వధింపఁదగునా కే చండాల నిన్నిచ్చటన్

గో—అయ్యా! ఇంచుక విచారించి మాటాడుఁడు.

అ—చీ! చీ!! శిశుహత్యమొనర్చిన పాతకుఁడవు నీ మొగమింకఁ జూడరాదు. చెచ్చెర స్టేషను దగ్గఱకు నడువుము. (చేతిసి బట్టుకొని దేవేంద్రవిజయునికి సైగ చేయును.)

దే—(సంకెలలు వైచి నవ్వుచు

: . మామా గుర్నోమహుఁడ వై
 స్వామిద్రోహంబు సేయ నే సమకట్టితి వా?
 సీమను కొనసాగిన వా?
 క్షేమంబా యింకమీఁదఁ జెఱసాలలలో

అ—మిత్రమా! మన కీ గుండగీసతో భాగ్యాద మేల రమ్ము వెళ్ళుదము.

(ముగ్గురు నిష్క్రమింతురు)

2 వ రంగము—న్యాయస్థానము.

(న్యాయమూర్తియును, న్యాయవాదులును, అరిందముఁడును, దేవేంద్రవిజయుఁడును, యోగీంద్రనాథుఁడును, సిరాజ్ హీక్ మున్నగువారును గోపాలచంద్, గౌరిచంద్ యదునాథగోస్వామి, భవాజి మున్నగు నేరస్థులును, మఱికొందఱు పౌరులును బ్రవేశింతురు.)

న్యా—మూ—అరిందముబాబుగారూ! ఈ నేరస్థులకు సంబంధించిన కాగితములన్నియుఁ దీసి యీ నేరస్వభావమును వివరింపుఁడు.

అ—(కాగితములను బల్లమీఁద నుంచి) అయ్యా! ఇంతవఱకు నేను సంపాదించినవిషయములను బట్టి వీరందఱు నేరస్థులే యైనను నిందుఁ గొందఱు ప్రత్యేక ప్రత్యేక నేరములకు సంబంధించినవా రగుదురు.

న్యా—మూ—అ దెట్లులో వివరింపుఁడు.

అ—ఈ జట్టు కెల్లరకు బిన్నాతులాలనువాఁడు నాయకుఁడు వాఁడు; మొదట నొక బ్రాహ్మణజాతికిఁ జెందినవాఁడు. ఎక్కువ తెలివి తేటలు గలవాఁడు; కాని చిన్నతనముననే దుర్మార్గవృత్తి నవలంబించి మోహిని యను కాంత పిత్ర్యమైనయాస్థిగలదని తెలిసికొని యామెను వివాహమై సొత్తు నంతయు స్వాధీనపఱచుకొని పిమ్మట నామెను వదలి జిత్తులకుఁ బుట్టినిల్లగు జుమీలియా యనువనితను జేపట్టి చాలమంది దుర్మార్గుఁ దోడు చేసికొని యెట్టిదౌష్ట్యము జరుపుటకును వెనుదీయకుండెను. వాఁడే సందర్భములఁబట్టి కేశవచందనియు, ఫూల్ సాహేబనియు వ్యవహరించుకొనుచుండెను. వాని కన్నివిధములఁ గుడిబుజ మనఁదగినవాఁడు, గౌరిచందొక్కఁడే. వాఁడేయే నేరములలో సంబంధము గలిగియున్నాఁడో వీఁడు నన్ని నేరములుచు జేసినవాఁడే. వీరి కెల్లరకుఁ దలకట్టు జుమల; అది యిప్పుడు పట్టువడ లేదు.

కాన నాబిడవిషయమప్రస్తుతము. తనను వదలిపెట్టినాఁ డనుద్వేష ముచే మోహిని ఫూల్‌సాహేబును జంపి చచ్చినది. కాన వారివిష యము నవసరము లేదు.

న్యా—మూ—ఏ రేయేనేరములకు సంబంధించినవారో ప్ర త్యేక ప్రత్యేకముగా వివరింపుఁడు.

అ—గోపాలచంద్. ఇతఁడు తనకున్నదానితోఁ దృప్తిఁజెంద క తనయన్నయాస్తి కాయసకూఁతు లిరువురు వారసులుగావున వా రిని సంహరించినచోఁ దానే వారసుఁడై యాస్తినంతయుఁ గాఁజేయ వచ్చు ననుతలంపున బిస్నాతులాలుతోఁ గుట్రజరిపి యందుఁ జిన్న పిల్ల యగురోహిణిని జంపించెను. పెద్దది యగురేవతిమాత్రము దై వకటాక్షమున వారిబారినుండి తప్పించుకొని బయటఁబడి యిపుడు మా యింట నున్నది.

న్యా—మూ—అయ్యా! నేను గోపాలచంద్ పక్షమున మాటలా డుచున్నాను. గోపాలచంద్రుగారు దైవభక్తుఁడును మొదటినుండియు ను జాల పరువుగా బ్రదికినపెద్దమనుష్యుఁడు నై యున్నాఁడు. ఇదివఱ కెట్టినేరమును జేయలేదు. ప్రభుత్వమువారికిఁ జాల పన్నును జెల్లిం చుచున్నాఁడు. అట్టి వీరిని వ్యవహారపుఁజిక్కులలో దింపినఁ దమకు లాభించునని యరిందమశాబుగారు మున్నగువారియనపై నిట్టినేర ము మోపిరే కాని యీయన నేరస్థుఁ డనుట కెట్టి యాధారమును లేదు. వట్టియూహలపై నాధారపడినచో ధర్మ మడుగంటును.

న్యా—మూ—అట్లనరాదు. ధనవంతులెల్లరు ధర్మాత్ములని యు దరిద్రులెల్లరు దుర్మార్గులనియుఁ దలంచుట వెఱ్ఱి; దుర్మార్గు లెవ్వ రిలోనైనను గలరు.

అ—అయ్యా! నేను దగినప్రబలనిదర్శనములు దొరకని దె వ్వరి నరెస్టు చేయనే చేయను. వీనిని జిత్తగింపుఁడు (ఉత్తరములు

న్యాయమూర్తియెనుట బల్లపై నుంచును.) ఇది చనిపోయిన బిస్నాతులాలునకును, ఈ గోపాలచందునకును జరిగినయుత్తరప్రత్యుత్తరములు; వీనిలోఁ గొన్ని వారియొద్దను గొన్ని వారలగృహములలోను దొరకినవి.

గో—అయ్యా! అవియన్నియు నాకు సరిపడనివారిచేఁ గల్పింపఁబడినవే; కాని నాచే వ్రాయఁబడిన వెంతమాత్రమును గావు.

అ—కల్పించుటకు మా కంత యవసర మేమి? కాని దీనిని గూడఁ జిత్తగింపుఁడు (ఖండితహస్తమును జూపును.)

న్యా—మూ—ఈ చేయి ఎవరిది?

అ—ఇది బిస్నాతులాలు ప్రభృతులచే హత్యచేయఁ బడిన యితనియన్న చిన్నకొమార్తచేయి.

న్యా—మూ—ఇదిమాత్రము విడిగా నుంచనేల?

అ—హత్యఁ గావించిన పిమ్మట గుఱుతుకొఱకు బిస్నాతు రోహిణిహస్తమును ఖండించి యీ గోపాలచందున కంపనతఁడు దీనిని దనతోఁటలోని నిమ్మచెట్టు మొదటఁ బాఁతిపెట్టెను. ఈ సంగతు లాలేఖలవల్లనే విశదము కాఁగలవు. పిమ్మట సోదా చూచుటలో మాచేఁ ద్రవ్వి తీయఁబడినది. మిగిలినశవమును బెట్టెలో నుంచి కూలివానివేసముతో నీగొరిచందు నాపేర ఠాణాకు జేర్చెను.

న్యా—
మూ— } (గొరిచంద్. గోపాలచందులతో) మీరేమి నెదరు?

గో—(గడగడవడంకును.)

గొ—దొంగతనము బట్టబయలైనప్పుడు నేఁ జెప్పున దేమున్నది?

న్యా—
మూ— } తక్కినవారివిషయ మేమి?

అ—ఈ గోసాయివేసమును ధరించిన దొంగ యదునాథుఁడు.

వీఁడన్ని ద్రోహికులందును బిన్నాతుకు సాయపడుటయే కాక తనశర ణుఁజొచ్చిన రేవతిని వేయిరూపాయలు పుచ్చుకొని హంతకులకుఁగైవస ము చేయఁజూచినాఁడు. ఇదిగో లేఖలు (బల్లమీఁదనుంచును.)

న్యా—
మూ— } ఓయీ! దీనికి నీ వేమనెదవు?

య—(నిరుత్తరుఁడై నేలఁజూచును.)

అ—ఈ భరద్వాజీమున్నగువారందఱును ద్రోహికులలోను వార్త ల నందించుటలోను బిన్నాతుకు సాయపడినవారు. నిన్న రాత్రి మా యింటిలోఁ జిక్కినవారు.

న్యా—
మూ— } మీ రేమి చెప్పుకొనెదరు?

భ—అయ్యా! వారు సెలవిచ్చినది సత్యము. ధనమున కాసిం చి గడ్డితిన్న మాట వాస్తవము. హత్యలుమాత్రము మేము చేయలే దని ప్రమాణము చేసి చెప్పుచున్నాము.

అ—అయ్యా! ఇంకొకమనవి. బిన్నాతును, జమలయు, గారిచం దును, తమిజుద్దీన్ అనుజమీందారునికి మందుపెట్టి కాలక్రమమున క్షీ ణింపఁజేసి చంపిరి. మఱియు వారిసంరక్షణలోనున్న సిరాజ్‌హీన్‌ను శ్మాశానగృహమున మాటి తమిజుద్దీన్ పుత్రిక యగు గుల్‌సుమ్‌ను గూడ హత్య చేయఁదలంచిరి.

న్యా—
మూ— } చాలును—

తీర్పు.

ఇపుడు నా యెదుట నుంచఁబడిన నేరస్థుల చర్యలును, వారిపై మోపఁబడిన నేరసంబంధపత్రములును సాక్ష్యమును దిలకింపఁగా నరిందమబాబుగారు చెప్పినదంతయు నిజమని నమ్మినాను. అనేకసమ

యములలో నరిందమబాబుమున్నగువారిని హత్య చేయఁజూచుటయు వానిని దప్పించుకొని మిక్కిలి సామర్థ్యముతో నిందఱిబంధించిన యరిందమబాబుగా రెంతయు స్తోత్రార్హులు. వారికిఁదగిన పారితోషికము నిమిత్తము ప్రభుత్వమువారికి గట్టిగా వ్రాసెదను. వారికి సహాయపడిన తక్కినవారికిఁ గూడఁ దగిన బహుమాన మిప్పింపఁ బ్రయత్నింతుము—ఇఁక నేరస్థులవిషయములో న్యాయశాస్త్రమునుబట్టి గోపాలచంద్, గారిచందుల కురిశిక్షయు, యదునాథునికి యావజ్జీవద్వీపాంతరవాసశిక్షయుఁ దక్కినవారి కొక్కొకనికి నేడుసంవత్సరములవంతునఁ గఠినకారాగారవాసశిక్షయు విధించితిమి.

అ—చిత్తము.

(అందఱును నిష్క్రమింతురు.)

[తెర పడును.]

3 వ రంగము—అరిందమునియిల్లు.

[అరిందముఁడును, రేవతీదేవేంద్రవిజయులును, గుల్ సుమ్‌సిరాజ్‌హీన్‌లును, మఱికొందఱు పెండ్లి పెద్దలును బ్రవేశింతురు.]

అ—దంపతులారా! ఇప్పటికి మీవివాహాదులు శుభముగా నవేఱినవి మీరిఁక మీ మీ గృహముల కరిగి,

చం. కడచినసంగతు ల్మఱచి కాఁగలకార్యము లెల్ల న్యాయ్యమే
ర్పడ జరిగించుకొంచుఁ బార పాటుననైన నసత్యవాక్యము
ల్నుడువక, దుష్టకోటిఁగల లోపలనైనను జేర్పఁబోక యె
ప్పుడు ననురాగయుక్తులయి పొందుఁడు సౌఖ్యము సర్వకాలముల్.

దే—సి—చిత్తము.

అ—ఇంకొకమాట.

మ. పని తీఱెంగద! యీయరిందమునిసం। బంధం బదేలా యిఁకన్
మనకంచు న్మఱవంగఁబోకుఁడు మతే। మాత్రింబో మీకంటెఁ బె
ద్దను ప్రాయంబునఁ గాన మీదు సుఖవృ। త్తాంతంబు లత్యాదరం
బునఁ బంపింపుఁడు వారవారమును జాబుల్ వ్రాసి మోదించెదన్.

దే—తండ్రీ! ఎంతమాటయంటిరి!

ఆ. వె.—ధైర్యమొసఁగి, ప్రాణ। దానంబుసేసి, నా
యన్నుమిన్నఁగూర్చి। యన్నిగతుల
నండయైననిన్ను। నఱసిముసంబైన
మఱచియుండఁగలనె। మాన్యచరిత!

రే—నాయనా!

సీ. అదయుఁడై చంపింప। యత్నించుపినతండ్రి
గోపాలచందును। నేపడంచి
పరిణయం బగుదువా? । ప్రాణంబు విడుతువా?
యన్నబిస్నాతును। మన్నుచేసి
ఎప్పుడు వధియింతు। నిరువదివేలెప్పు
డబ్బునో యనుగారి। యసువులూడ్చి
తనయండఁ జేరిన। నను హంతలకొసంగ
నూహించు యదునాథు। నుక్కడంచి

తే. గీ. త్రాతయును, దైవమును, గన్న। తండ్రియునన
గంటినిన్ జెప్పవలె నన్నుఁ। గాచినట్టి
మాన్యుఁడవు నిన్ను వేయిజ। న్మములనైన
మఱతునే ప్రాణములనైన। మఱతుఁగాని.

గుల్—నన్నును నాభర్తను జంపి మాసొత్తులం గాంజేయనెంచిన దుష్టుల రూపుమాపి మమ్ముద్ధరించిన మిమ్ముల మఱతుమా?

సి—అయ్యా! నేను మాత్రము మఱచిపోదును. ఏమన, వెనుకటికష్టములను.

దే—అయ్యా! నామనవి యొకటి వినుండు:

అ—చెప్పుండు.

సి—చెప్పుండనుట కాదు. మీ మనవి నంగీకరింతుమనుండు.

అ—మీరు చెప్పినదానిని నే నెప్పుడైనను గాదంటినా? మీరుచెప్పున ట్లొనరించెదం జెప్పుండు.

దే—చంద్రునికొకనూలుపోంగన్నట్లు భక్తిపూర్వకముగా మే మెల్లరమును గలసి యొసంగు నీరెండులక్షలరూపాయలను స్వీకరింపుండు. (ఈయంబోవును.)

అ—(తీసికొనక) బిడ్డలారా! నేను త్రికరణశుద్ధిగా మీక్షేమము నుద్దేశించియే పనిచేసితిని; గాని ప్రతిఫలాపేక్షతోం గాదు. ఇది నా కక్కఱలేదు. మీరే యుంచుకొని యిష్టమున్న నేదేని ధర్మకార్యములకు వినియోగింపుండు.

సి—చిత్తము. మే మెప్పుడును మీయాజ్ఞాబద్ధులమే. మీదయమాత్ర మెప్పుడు నిట్లే యుంచం బ్రార్థితులు.

అ—నే నెప్పుడును మీక్షేమమే కోరుచుందును. ఇంకేమి కావలయును?

దే—మీదయవలన మా కేకొఱంతయును గలుగదు. అయిన నిట్లగుంగాక.

—• భరతవాక్యము. •—

చ. జనులు నిరంతరంబు విలసత్సదయాశయముం గడియింతురుగాత; దు
ర్జనులు నికృష్టమార్గముల జాడల వీడి చరింతురుగాత; నే
ర్పున నధికారు లాత్మసుఖకాముం ద్యజియించి దురాత్మకోటివ
ర్తనముల గాంచుచుం దగిన దండనము ల్విధియింతురుగావుతన్.

గద్యము. ఇది శ్రీరామచంద్రవరప్రసాదలబ్ధ కవితామహాదైశ్వర్య
సంపన్నుండును, ఇక్ష్వాకుర్తివంశపయః పారావారరా
కాసుధాకరుండును, అంకమార్య జ్యేష్ఠపుత్రుం
డును, సకల సుకవిజన విధేయుండును
నగుతిరుపతిరాయవిరచితారిందము

విజయమహానాటకంబున

షష్ఠాంకము.

ఓమ్. తత్సత్.



మాగ్రింధ మండలి ప్రిథమభూషణమగు " ఉర్వీసుతో ద్వా
హము" ను గూర్చి—

## అభిప్రాయములు

గుడివాడ బోర్డు హైస్కూలు సంస్కృతపండితులును ఉభయ భాషావిశేష కవితాధురంధరులును శతావధానులును వేదమూర్తులు నగు విద్వాన్ భమిడిపాటి అయ్యప్పశాస్త్రిగారు.

చం. సరసపదార్థ భావవిక । సత్సుమసారరసప్రిసారిత
స్థిరకవితానురాగమున । జెన్నలరారి, స్వవృత్తివృత్తభా
సురపరివర్తమానమయి, । సుందర బంధుర రూపదీప్తమై,
శరదను రూపసత్కళను । జంద్రికయై, విలసిల్లి మించి య
ద్దిరకలవాణి బాలకవి । తిర్పతిరాయని నాటకంబు, స
త్వరగతిదృశ్యమానమయి, । ధర్మము గైకొని, సత్యవాక్యవి
స్ఫురితమహానుభూతిగను । శోభిలియున్నది చంద్రిసూర్యమై
సురుచిరకీర్తి గాంచుత వ । సుంధర(శ్రీ)ఘనసార సారమై"

గీ. ఎంతజదివిన, రుచులూర । వింతదసరి
నవరసస్ఫూర్తి జెలంగి వి । నయమునింపు
గాన, గానమాధురినిజ । గానవృద్ధి
గనుత యుర్వీసుతోద్వాహ । మనుదినంబు

బర్మారాష్ట్రిమునందలి ఆంధ్రుల అభ్యుదయాభివృద్ధికై నిరంతరము కృషిసలుపుచున్న రంగూన్ తెలుగు పత్రిక యిట్లు వాకొనుచున్నది.

ఇందలి శైలి మృదుమధురమై భావాలంకృతముగ నుండుట యెగాక ప్రదర్శనానుకూలముగ నున్నది. సీతాకళ్యాణ ఘట్టమునందును మరికొన్ని స్థలములందును కొన్ని వచనములు సంఘసంస్కరణాభిలాషను జూపుచున్నవి. కథాసందర్భము చక్కగానున్నది.

# ఆంధ్రపత్రిక.

ఇదియొక చక్కనియైదంకముల తెలుగునాటకము. శ్రీమద్రామాయణమునందలిసీతావివాహకథయేయిందలియితివృత్తము. విశ్వామిత్రమునివచ్చి రామలక్ష్మణులను కొనిపోవువరకు ప్రథమాంకము నందును, తాటక వధాంతముగల కథ ద్వితీయాంకము నందును, అహల్యాశాపవిమోచనాంతముగల కథ తృతీయాంకమునందును, తక్కిన కథాభాగము చతుర్థ పంచమాంకములందును కూర్పఁబడియున్నది. శైలిసరసమైనది—

---

Mr. P. RAMACHENDRARAO, B. A., *Writes*:—

Sir,

Recived your presentation copy of 'Urvi Suthodvaham' with thanks. I have gone through the whole of it with much interest and I am greatly pleased with it. On the whole the book is a good production of the author whose facility of Expression Smoothness of diction and nice construction are really commendable. It is no exaggeration to say that the Drama will, in course of time, occupy a prominent place in the field of Telugu Literature; and I sincerely hope that the author will really serve the mother tongue by his future productions.

---

# ఆంధ్రప్రబోధినీగ్రంథనిలయము మండపల్లి.

లింగాలపోస్టు  కృష్ణాజిల్లా

నవరసభరితములగు నవలలు—మనోరంజకములగు నాటకములు—మృదుమధుర శైలిప్రబంధములు—మత-సాంఘిక-సాంసారిక—రాజకీయ-విషయములను చర్చించుచు, గ్లేజుకాగితములతో—మల్లెమొగ్గలవంటి యక్షరములతో—సుచ్ఛటమైన బొమ్మలతో—ముద్దులొలుకు బైండులతో—మూడు మాసముల కొక్కటివంతున వెలువడుచుండును.—

## ఉద్దేశ్యము.

కొంతకాల మౌనత్యదశ ననుభవించి యెక్కువ మెప్పొంది కాలవశమున మిక్కిలి క్షీణదశ ననుభవించుచున్న ఆంధ్రభాషామతల్లికి సాధ్యమైనంతవ్యాప్తి గలిగించి భాషాసేవ జేయుటయే మా ముఖ్యోద్దేశ్యము.—

## గ్రంథరచనానియమము.

సమర్థులును సుప్రసిద్ధులునగు పండితపుంగవులచే నన్నివిషయములను గురించియు వ్రాయించి ప్రకటించుచుందుము.—

# నిబంధనలు

ఇందు శాశ్వతచందాదారులుగఁ జేరువారు ప్రవేశరుసుము రు 0-8-0లు ముందుగాఁ జెల్లింపవలయును.—

ఇందు మూఁడుమాసముల కొక్కటివంతున వెలువడు ప్రతి గ్రంథమును జందాదారులకు వి.పి.గాఁ బంపుచుందుము,—

గ్రంథములను బంపుటకగు పోస్టేజీ మొదలగు వ్యయము లన్నియుఁ జందాదారులే భరింపవలెను.—

ఇందు సంవత్సరమొత్తమున వెలువడు గ్రంథము లన్నియు నాలుగురూపాయలవెలకు మించియుండవు.—

చందాదారులు ముందుగా నాలుగురూపాయలను బంపిన నా సంవత్సరమున వెలువడు నాలుగుగ్రంథము లెప్పటికప్పుడు పోస్టుద్వారా బంపుచుందుము. అందువలఁ బ్రతిపుస్తకమునకుఁ జెల్లింపవలసిన మనియార్డరుకమీషను రు 0-8-0 లు రిజిస్టరు ఖర్చు రు 0-8-0 కూడి వచ్చును.

ఇందు వెలువడు గ్రంథములపై నప్పుడప్పుడు గొప్పబహుమానపరీక్ష లేర్పరుపఁబడుచుండును.—

ప్రవేశరుసుము చెల్లించి మా గ్రంథములను శాశ్వతపుచందాపద్ధతినిఁ బొందు గ్రంథాలయములకు సగము వెల కొసంగఁబడును.—

## ఇందీవరకు వెలువడిన గ్రంథము:

## ఉర్వీసుతోద్వాహము.

వెల ఇతరులకు— రు 1-0-0

చందాదారులకు— 0-12-0

చందాపద్ధతినిఁబొందు గ్రంథాలయములకు— 0-8-0

నాటకములు ! నాటకములు !!

# మార్కండేయ విజయము.

ఇందు మహాభక్తాగ్రగణ్యుఁడగు మార్కండేయుని జననవృత్తాంతము; బాల్యచేష్టలు; తల్లిదండ్రులయెడ భక్తి; భక్తియోగము చేతనే పరమేశ్వరుని సాక్షాత్కారమువడసి, మృత్యువును జయించి యల్పాయుష్కుఁడయ్యు దీర్ఘాయుష్యముఁ బొందుట. యమలోకవర్ణనము; నారదుని కలహావిద్యాప్రదర్శనము మున్నగు విషయము లభివర్ణింపఁబడినవి. చక్కనినునుపుకాగితములపై ముద్రింపఁబడినది.

(ఫార్సీ పాటలుగూడ చేర్పఁబడినది.) పోస్టేజీగాక వెల రు 0–12–0.

# ముక్తావళి.

మదాలసా కువలయాశ్వుల పరస్పరానురాగము; లోకభయంకరుఁడగు పాతాళకేతుని గాలవాజ్ఞచే కువలయాశ్వుఁడు సంహరించుట; అన్ననుజంపెనను కోపమున తాళకేతుఁడు మాయాయతివేషంబును బూని గాలవాశ్రమమునున్న కువలయాశ్వుని యజ్ఞమునిమిత్తము ధనమిమ్మని యడుగఁగా తనమెడలోని ముత్యాలహారము దానమిచ్చుట; తాళకేతుఁ డాముత్యాలహారముం దీసికొని శత్రుజిన్మహారాజుకడకేగి ముత్యాలదండ యానవాలు జూపి, కువలయాశ్వుఁడు మృతినొందెనని చెప్పుట; ఈవృత్తాంతము విని మదాలస సహగమనవిధిని లోకాంతరమున కేగుట; కువలయాశ్వుఁ డింటికివచ్చి మదాలస మరణమునకు దుఃఖించుట; ఉరగలోకాధీశుఁడగు నశ్వతరుని తపోబలమున దిరిగి మదాలసం బొందుట; ఇంకను పెక్కువిషయములుగలవు. పద్యములు పండిత పామర రంజకములు.

పోస్టేజీగాక వెల రు 0–8–0.

**SASTRY BROTHERS,**
**COCANADA.**

## ద్వితీయ బహుమానము

రు 50-0-0 లు

కథను గ్రహించుటయే ప్రధానముగా నెంచి యొకసారి చదివి మూలఁబడవేయక పలుమారులు చదివి యందలివిశేషమును దెలిసికొనుటకై మాగ్రంథమాల చందాదారుల కొక నవీనపద్ధతిని బహుమానము [illegible]సంగుచున్నది.

[illegible]వేశరుసుము రు 0-8-0లు ప్రశ్నాపత్రములతో బంపవలెను.

ఈ అరిందమ విజయములో నున్న యీక్రింది యక్షరములుగల సంపూర్ణవాక్యముల నేరి తీయవలెను.

ం ం ం ౘ ర ఱ ఱ త స న బ ధ డ ని దీ జ్జ దు రు గు ఘు దా వా ఖా ద్వ్ర

అట్టివాక్యములలో నీ పైయక్షరము లన్నియు నుండవలెను. అక్షరములవరుసలో నెట్టి మార్పులున్నను నుండవచ్చును. అట్టివాక్యము లెక్కువ తీసినవారి కేబదిరూప్యములు బహుమాన మొసఁగఁబడును. వాక్యములు వ్రాసి వానికెదురుగ నవియున్న పుటసంఖ్యయు బంక్తిసంఖ్యయు వ్రాయవలెను. ఈవాక్యములు డిశంబరుమాసాంతములోగా బరీక్షాప్రవేశరుసుముతో సహా మా కార్యస్థానమున కంపవలెను.

ఆంధ్రప్రబోధినీ గ్రంథనిలయము.

మంటపల్లి, లింగాలపోష్టు.

కృష్ణా జిల్లా.

# ఆంధ్రప్రబోధినీ గ్రంథమాల.

ఇందు వెలువడనున్న గ్రంథములు.

మామండలి తృతీయ భూషణము.

## వైదర్భీ పరిణయము.

గ్రంథకర్త.

శ్రీ రాజా కమదన వేంకటరావు బహద్దరు

జమీందారువారు.

చతుర్థ భూషణము.

## విజయశ్రీమము.

—అద్భుత నవల.—

గ్రంథకర్త.

శ్రీ ఓడమాచు రామచంద్రరావుగారు బి ఏ.

పంచమ భూషణము.

## ప్రపంచము

గ్రంథకర్త.

శ్రీ చిల్లర వేంకటేశ్వర కవిగారు శతావధాని.